# పీఠిక.



ప్రతి కుటుంబమునకు ఆదాయమును, దానికి తగిన వ్యయమును నేర్పడుచుండును. అట్లే ప్రతి జాతికిని జాతీయ ఆదాయము జాతీయ వ్యయములు నుండును. అవసరము వెంబడి తమ పురోభివృద్ధికొఱకు కుటుంబమునకును జాతికిని గూడ తాము భరింప జాలునంతటి ఋణములును ఉండును; ఉండవచ్చును. భారతదేశ పరిపాలన భారతప్రజల చేతులలో లేదను సంగతి జగద్విదితమే కదా! ఈ నూటయేబది వత్సరముల పరపరిపాలనాకాలములో "జాతీయఋణములు" అనబడునవి యేర్పడినవిధమును ఆంధ్రలోకమునకు, ఆంధ్రప్రజకు, ఆ ఋణభారమును మోయుచున్న ఆంధ్ర కృషీవలునకు నెఱిగింప వలెనను కుతూహలముతో శ్రీయుత జె. సి. కుమారప్పగారి నివేదికను తెనిగించితిని. అనువదించుపట్ల దొరలిన దోషము లున్నచో మా పాఠకులు మన్నింతురు గాక!

తణుకు,
20—10—1933.

ఇట్లువిన్నవించు,
ముదిగంటి జగ్గన్నశాస్త్రి.



# భారత

# జాతీయ ఋణములు.

అఖిల భారత కాంగ్రెసు కమిటీయొక్క
కార్యనిర్వాహక కమిటీవారికి,
అలహాబాదు.

1. అఖిల భారత కాంగ్రెసు కమిటీయొక్క కార్యనిర్వాహక కమిటీవారిచే "ఈస్టు యిండియాకంపెనీవారి యొక్కయు (కుంఫినీ బావుటా), హిందూదేశములోని బ్రిటీషు ప్రభుత్వముయొక్కయు ద్రవ్యసంబంధమైన వ్యాపారములను తనిఖీ చేయుటకును, ప్రజాఋణము లేక జాతీయఋణము అని పిలువబడుచున్న దానిని తనిఖీచేయుటకును, యింగ్లండు హిందూదేశములమధ్య నేదేశ మెంత ఋణమును, అచ్చుకొనవలె ననువిషయమును గురించి నిర్ణయించుటకును" నియోజింపబడి యీ దిగువ సంతకములు చేసిన మేము యీ క్రింది విధముగా మా నిర్ణయమును సమర్పించుకొనుచున్నాము.

# మొదటి భాగము.

2. ఈ విషయమున కెంతయు ఒప్పియున్నట్లు మాకు గోచరించునట్టియు, నితరుల యభిప్రాయముల చేతను, దేశపు పోలికలచేతను, పూర్వాచారముచేతను బలపరుప బడునట్టి చరిత్రలు, లెక్కలు, అంకెలు, పరిస్థితులు, షరతులు మొదలగునట్టి సాధనసామగ్రిని ప్రోగుచేయుటయు, వాటి బలము మీదనే మా నిర్ణయముల నేర్పరచుటయు మా తనఖీయొక్క యుద్దేశమని మేము గ్రహించుచున్నాము. మేము కనుగొనవలసిన విషయమునకు మూడువిధములైన పరిశోధన లవసరము.

(a) ఈస్టు యిండియా కంపెనీవారున్నూ బ్రిటిషుప్రభుత్వమువారున్నూ చేసిన మొత్తపువ్యాపారముల ఫలితముగా పార్లమెంటువారి శాసనము ననుసరించి యెట్టి శాసనములున్నూ లేకగాని భారతదేశముపై మోపబడిన యధిక ఋణభారము.

(b) కంపెనీ ప్రభుత్వమునుండి భారతదేశము తప్పింపబడి బ్రిటిషుపరిపాలన క్రిందకు వచ్చిన తరువాత భారత ప్రభుత్వమువారు చేసిన వ్యాపారముల వలన సంక్రమించిన ఋణభారము.

(c) ఇక ముందు భారతదేశ మెంతఋణమును అచ్చుకొనవలెను; ఇంగ్లాండు యెంత అచ్చుకొనవలెను అను విషయమై మా నిర్ణయము.

అనగా నింతవరకును భారతదేశముపై మోపబడిన ఋణభారమునకు గల న్యాయాన్యాయములను, అర్హతానర్హతలను, ఉచితానుచితములను గురించియే విచారింపవలసియున్న దని మేము గ్రహించితిమి.

మేము మా సారాంశములను తీయునపుడు భారతదేశము యింగ్లండునుండి యెంత ద్రవ్యమును రాబట్టుకొనవలెననే విషయమును గురించికూడ చర్చించియుంటిమి. ఎట్టి బాధ్యతలు లేని కార్యనిర్వాహక ప్రభుత్వమువారు భారతదేశముపై మోపిన ఋణమునంతను త్రోసివేయుట కాంగ్రెసువారి ఉద్దేశము కాదని సూచించుటకే మా నిర్ణయములో మూడవభాగమును జేర్చితిమి.

3. ఋణపరిశోధన క్రిందకువచ్చు విషయములను సుగమముగా జర్చించుటకు దీని మూడుభాగములుగా విభజించితిమి. 1858 వ సంవత్సరము వరకును ఈస్టుయిండియా కంపెనీవారి యొక్క సమగ్రమైన వ్యాపారములను దీసికొంటిమి. తరువాత మొత్తపుఋణభారమును భారతదేశఋణము అని పిలువబడు దానిని రెండుప్రధానాంగముల క్రింద విచారణ చేసితిమి. (1) ఏవిధమైన ప్రతిఫలముగాని ఆర్థికప్రయోజనముగాని యాధారముగాని లేకుండ చేయబడిన ఋణములు. (2) ఏదో యొకవిధమైన యార్థిక ప్రయోజనము లేక ప్రతిఫలముగాని పుట్టించుట లేక కలుగజేసిన ఋణములు.

పై వ్యాపారముల వలన సంక్రమించిన ఋణభారమును రెండుదేశములకును న్యాయముగను, ఉచితముగను నుండు

విధమున నాంగ్ల భారతదేశములకు బంచిపెట్టుటను గురించి తుదను విచారించితిమి.

4. భారతవాదముయొక్క ప్రధానలక్షణ మేమనగా నీ పరిశోధనక్రిందకు వచ్చిన నిర్బంధఋణముల విషయములో భారతదేశమున కింతవరకు నెంతమాత్రమును కాదనుటకు గాని యౌననుటకుగాని యెట్టి యధికారమును లేదు. ఈసందర్భములో భారతదేశ ఆదాయవ్యయములపై భారతప్రజలకుగాని వారిప్రతినిధులకుగాని యేమాత్రపు జోక్యమును లేదని చూపుటకు (మనకు సంబంధ మున్నంతవరకు) ఇండియాప్రభుత్వము వారెప్పు డెపు డెట్టి యవస్థాభేదముల నొందుచు వచ్చిరో చూపుట యవసరము. భారతదేశపు బడ్జటు (అనగా ఆదాయ వ్యయముల మదింపును) శాసనసభలోనికి దెచ్చుట మొట్టమొదట 1860 వ సంవత్సరపు శాసనసభలో జరిగెను. కాని యాసభ భారతప్రజల కెంతమాత్రమును ప్రతినిధిసభ కాదు. 1861 వ సంవత్సరపు ఆక్టుప్రకారము పై శాసనసభకు గొంతమంది భారతీయులు పేర్కొనబడిరి. ఈ శాసనసభ శాసనములను జేయుటతప్ప మరేమియు జేయరాదు. ఆదాయవ్యయ మదింపులను గురించి నోరెత్తి చర్చింపరాదు. ఇంతేకాక శాసనసభలో మరియొక క్రొత్త పన్నును విధింపవలసిన శాసన మవసరమైనప్పుడుమాత్రమే యీ యాదాయ వ్యయ మదింపును జదివి యర్థము జెప్పెడివారు. ఈ స్థితి 1892 వ సంవత్సరపు భారతశాసనసభల ఆక్టు వరకు సాగింపబడెను. కాని యీ ఆక్టుక్రిందగూడ పై మదిం

పుకు అర్థము చెప్పవలసిన బాధ్యతమాత్రమే ప్రభుత్వమునకు గలదు. కాని దానిని జర్చింపరాదు. శాసనసభ్యులు దానిని గురించి తమ యభిప్రాయములను చెప్పవచ్చును. కాని వారెట్టి తీర్మానమును తెచ్చుటకుగాని, దానిలో నేభాగము మీదనైనను శాసనసభను విభజించుటకుగాని వారికెట్టి యధికారమును లేదు. 1909 వ సంవత్సరపు భారత శాసనసభల ఆక్టు సరాసరి ప్రజలచేగాక నప్రత్యక్షముగా నెన్నుకొనబడు కొంతమంది నూతనసభ్యుల కవకాశ మిచ్చి సభను పెంచెను. ఈ ఆక్టు క్రింద కొన్ని విషయముల ఆదాయ వ్యయములు మాత్రమే యుదహరింపబడి వానిని గురించిమాత్రమే శాసనసభలో జర్చించుట కంగీకరింపబడెను. ఈ విషయములను గురించి మాత్రమే తీర్మానములను దెచ్చుటకును శాసనసభను విభజించుటకును నధికార మొసంగబడెను. కాని యీ తీర్మానములు కేవలము విగ్రహపుష్టికొఱకే! అనగా నివి సలహారూపముగా మాత్రమే యుండును. తేబడిన తీర్మానములకైనను (అవి ప్రభుత్వమును నియమింపజాలనందున) శాసనసభలో ప్రభుత్వమునకు స్థిరమైన మెజారిటీయున్నందున, నెట్టి పనయులేక తుంపర్లపన మాత్రమే మిగిలెను. 1920 లగాయితు కేంద్రప్రభుత్వములోను రాష్ట్రప్రభుత్వములలోను మరికొన్ని మార్పులు జేయబడెను కాని ప్రభుత్వమును నియమించు యధార్థమైన యధికారము బాధ్యతారహితమైన కార్యనిర్వాహక ప్రభుత్వము చేతులలోనే యుండెను. వ్యయమునకు సంబంధించిన విషయములలో శాసనసభ్యుల వోటు లేక యుంగీ

కారము కావలసిన విషయములు కొన్ని, అక్కరలేని విషయ
ములు కొన్ని యని విభజించిరి. మొత్తపు వ్యయములో శాసన
సభ్యుల యంగీకార మక్కర లేకుండ నూటికి 75 రూపాయిలు
వారు యథేచ్ఛగా ఖర్చుపెట్టుకొనవచ్చును. దీనికి తోడు గవ
ర్నరుజనరలుగారును, రాష్ట్రీయగవర్నరులును శాసనసభ్యుల
యంగీకారమును పొందవలసిన విషయములను తిరిగి లాగు
కొనునట్టియు లేక తామే ధృవపరచునట్టియు నధికారమును
గలిగియుండుటచే భారతప్రతినిధులకు యొప్పచెప్పబడినట్లు
పలుకునట్టి యాదాయ వ్యయములపైనున్న యత్కించి దధి
కారముకూడ శూన్యమే యగుచున్నది. పైగా చట్టముప్రకా
రము పన్నువేయుటకు గాని అప్పు తీసికొనుటకు గాని ప్రభు
త్వము వారు మాత్రమే సలహా యొసంగవలెను. కనుక బ్రిటీ
షుప్రభుత్వకాల మంతటిలోను భారతప్రజల యంగీకారముతో
గాని, వారికి తెలిపిగాని భారతప్రభుత్వమువా రేఋణమును
జేసి యుండలేదని న్యాయదృష్టితో జెప్పక తప్పదు. కనుక
సమాధాన పడుటకు ప్రయత్నించుచున్న యీ తరుణమున నీ
రెండుదేశముల మధ్యనుగల ఋణబాధ్యతలను న్యాయమును
బట్టియు, ఔచిత్యమును బట్టియు పంచుట ధర్మమేయగును.

5. "ప్రజాఋణములు" లేక "జాతీయఋణములు"
అను వానిని త్రోసివేయవలె నని కాంగ్రెసు ప్రయత్నించు
చున్నట్లనేకసారులు నింద మోపబడుచున్నది దేశప్రయో
జనములకొఱకు జేయబడిన ఋణముల నెంతమాత్రము "త్రోసి
వేయక" వానిని "యామోదించుటకే" కాంగ్రెసు ప్రయత్నిం

చుచున్నది. ప్రస్తుత "పబ్లిక్ ఋణములు" "జాతీయ ఋణములు" అని యథార్థముగా పిలువబడనేరవు. ఏలననగా వానిని నిజముగా నింగ్లండు చేసి భారతదేశముపై మోపుచున్నది. డెబ్బది వత్సరముల క్రింద సర్ జార్జి వింగేటు అను నతడు దీనిని గురించి యిట్లు వ్రాసెను.

"మనము విషయమును జాగ్రత్తగా బరిశోధించితిమేని ఇండియా ప్రభుత్వము ప్రత్యేక మొక వేరు ప్రభుత్వముగాక మొట్టమొదట నుండియు బ్రిటిషు ప్రభుత్వముయొక్క యొక శాఖమాత్రమే యగుచున్న దని తెలిసికొననగును. బ్రిటిషు మంత్రివర్గమునారే, కంపెనీని నియమించు బోర్డు అధ్యక్షుని ద్వారా, ప్రవర్తించుచు భారత ప్రభుత్వపరిపాలనా సిద్ధాంతము ను నడపు మూలవిరాట్టు లని స్పష్టము కాగలదు. భారత ప్రభుత్వముయొక్క ప్రతిచర్యకును మంత్రివర్గమువారు బహిరంగముగా బాధ్యత వహింపవలసివచ్చినచో పార్లమెంటువారి వలన గలుగుచుండు నభ్యంతరము లేమియు నక్కర లేకుండ మంత్రివర్గము వారు భారత దేశాదాయమును సంపత్తును వినియోగించుకొనుటకు ఈస్టు ఇండియా కంపెనీవారొక చక్కని తెరచాటుగా మాత్రమే యుపయోగపడిరి యథార్థము లింగ్లండ (వీటి నెవరును కాదనజాలరు) భారతప్రభుత్వము వారి చర్యలన్నియు, మొదటినుండి తుదవరకును, బ్రిటిషు జాతియొక్క చర్యలే యనుట కెట్టి సందియమును లేదు. భారత దేశ మెన్నడు నొకచట్టము కాదు సరికదా దాని ఛాయనైనను లేక జాతీయ ప్రభుత్వఛాయనైనను యెఱుగదు! అది జయింప

బడిన యొక దేశమువలె వరుసగా ప్రాప్తించిన బ్రిటిషుమంత్రి వర్గములవారి యభిమతానుసారముగా బాలింపబడుచు వచ్చెను. భారతఋణమును నిజముగా నీదేశముయొక్క పరిభుత్వమే చేసెను. కనుక మన మీ హిందూదేశఋణములనుండి యెట్లు తప్పించుకొనగలమో నా కర్థముగాకున్నది. సామ్రాజ్యప్రభుత్వమువారు చేసిన ఋణములను బ్రిటనుదేశ మెట్లు భరింపక తప్పదో యట్లే భారత పరిభుత్వమువారు చేసిన ఋణములను గూడ బ్రిటనుదేశము భరింపక తప్పదని అకలంకమైన యాత్మయు, న్యాయదేవతయు బలుకుచున్నవి. బ్రిటిషురాజ్యములో నున్న భారతదేశముపై బడుచుండు క్రొత్తఋణ మంతయు బ్రిటనుదేశముపైననే పడుచుండును. భారతదేశాదాయవ్యయములపట్ల నీ దేశ పరిజ లింతగా యోజించుట కీయంశమే కారణమయ్యెను 1857 వ నాటి విప్లవము మొదలు భారత పరిభుత్వమువారు హిందూదేశములో నూటికి 6 వడ్డీచొప్పున 100 లక్షలు ఋణము జేసిరి. ఆ పరిభుత్యమువారు యీధనమునే యీ దేశములో నూటికి 4 చొప్పునను బ్రిటిషుజాతి 3½ చొప్పునను తీసికొనుట కవకాశము గలదు. ఇట్టి దూబరా నీతి వలన మనజాతీయఋణము ప్రతివత్సరము 5 లక్షలు హెచ్చగుచున్నది. ఆత్మవినాశమును దెచ్చిపెట్టు యిట్టి నీతి ననుసరించునట్టి పరిత్యహాము (అంత్యదిన మాసన్నమగుసరికి) మనల నొక యఘాతమునకు గొంపోవును. బ్రిటిషుప్రజల కీదృశ్యము దృగ్గోచరము గాకపోవచ్చును. కాని యిట్టి దిన మంతమాత్రముచే నాగక తెక్కలు గట్టుకొని వచ్చుచున్నది."

(మనకు భారతదేశముతో గల ద్రవ్యసంబంధములు పే 23-24) తుద కా తుదిదినమే యాసన్నమయ్యెను.

6. ఈఋణము లన్నియు నతి పవిత్రవస్తువులవంటి వనియు, వీని నెవరును కాదన రాదనియు గొందరు బ్రువ్వచున్నారు. ఈవిషయములో నట్టి పవిత్రతకు జోటెక్కడ నున్నదో మాకు గానరాకున్నది ఈ ఋణములన్నియు భారతదేశము మీద బలవంతముగా నస్వేచ్ఛికముగా రుద్దబడినవి. ఇవి భారత ప్రజల కళ్యాణము కొఱకే చేయబడిన వని చూపబడనప్పుడీసందర్భములో నుపయోగింపబడు 'పవిత్రత' యను శబ్దమున కర్థ మేమియో తెలియకున్నది. యథార్థమున కీ కమిటీ పరిశోధింపవలసిన దీవిషయమే! న్యాయదృష్టితో, ధర్మబుద్ధితో జూచినచో 'నీఋణములలో నెంతవరకు భారతదేశము భరించవలెను'అను నదియే పరిశోధనీయాంశము. న్యాయముగాను భారతప్రజల కళ్యాణమునకుగాను జేయబడిన ఋణము లన్నింటికిని బవిత్రత యుండుననుట నిర్వివాదాంశము. ఈ ఋణములలో నేవియైనను వారి లాభమునకొఱకుగాని, వారి శ్రేయస్సు కొఱకుగాని చేయబడినట్లు చూపబడనపుడు అట్టి ఋణముల నుండి వారిని విముక్తులను జేయుటయే ప్రజలపట్ల సంచరింపవలసిన నీతి. కనుక నీ ఋణములు గావింపబడినపుడు వీని నెవరు భరింపవలసి యుండెనో వారికి పంచిపెట్టుటయే మే మిపుడు చేయవలసిన న్యాయము.

---

# రెండవభాగము

## ఈస్టు యిండియా కంపెనీ పరిపాలనక్రింద.

**7.** ఈ కంపెనీయొక్క చరిత్ర— కంపెనీ పరిపాలన నుండి భారతపరిపాలన బ్రిటిషు ప్రభుత్వమువారి పరిపాలన క్రిందకు మార్చబడిననాడు యీయుభయులును కలిసి చేసి కొనిన యేర్పాటుల ప్రకారము భారతదేశముపై నెంతఋణము మోపబడినదో మన మిపుడు పరిశీలింపవలసి యున్నది. కనుక దీనికి బూనుకొనుటకు ముందు కంపెనీవారి చరిత్రను స్థాలీపులాకన్యాయముగా జర్చించుట కొంతయవసరము. ఒక చిన్న వర్తకపు కంపెనీ రాష్ట్రాధిపత్యము నెట్లు సంపాదించెనో చూతము.

'ఈస్టు యిండియాకంపెనీ' అను పేర నొకవర్తకసంఘము 1600 సంవత్సరములో నింగ్లండురాజుగారివద్ద పట్టాపొంది ప్రారంభమయ్యెను. ఈ పట్టావలన కలిగిన హక్కులలో ననేక మార్పులను పొందుచు తరువాత నీ కంపెనీ 1773 సంవత్సరమువరకు సాగెను. 1773 లో నీకంపెనీయొక్క వ్యవహారములు 'రిగ్యులేటింగు ఆక్టు' అనగా 'నియమించుచట్టము' అను చట్టముక్రింద సాగింపబడెను. దీనివలన జరిగిన దేమనగా, భారతదేశములో బ్రిటిషుప్రభుత్వము వారు సంపాదించినట్టియు, కలిగియున్నట్టియు రాష్ట్రములను బరిపాలించుటకు కంపెనీ వారు బ్రిటిషుప్రభుత్వమువారికి యేజెంటుగా బనిచేసిరి.

ఈ చట్టమువల్లను తరువాత చేయబడిన చట్టములవల్లను కంపెనీ యొక్క వర్తకశాఖయు రాష్ట్రపాలనశాఖయు వేరుచేయబడి 1814 లగాయతు యీ రెండుశాఖలకును ప్రత్యేకము లెక్క లుంచవలెనని నియమింపబడెను. భారతదేశమునకుసంబంధించి సంతవరకు నీ కంపెనీకి గల ప్రత్యేక వర్తకహక్కులు 1813 లో చేయబడిన చట్టములవల్ల రద్దుచేయబడి, 1833 లో చేయబడిన చట్టము (4 వ సెక్షను) క్రింద దీని వర్తక స్వభావమే యంతరింపజేయబడెను.

ఈ చట్టముయొక్క 9 వ సెక్షనులో నిట్లున్నది. "పై నుదహరింపబడిన కంపెనీవారికి గ్రేటుబ్రిటనులో బాండుల రూపకముగానున్న ఋణమంతయును భారతదేశములో రాష్ట్ర పరిపాలనకు వారు చేసిన ఋణమంతయును, యీ కంపెనీ యీ తేదీకీయవలసిన యన్నివిధములైన యితర ఋణములును, పై నుదహరింపబడిన 1834 ఏప్రిల్ 22 వ తేది లగాయతు యీకంపెనీవా రిదివరలో జేసికొనిన యొడంబడికలు, కంట్రాక్టులు, అప్పులు మొదలగు వానికి జెల్లింపవలసిన యావత్తు మొత్తములు ఖర్చులు వ్యయములును పై తేదీ లగాయతు పై నుదహరింపబడిన రాష్ట్రముల పరిపాలనకుగాను చట్టబద్ధముగా చేయబడు అన్ని ఋణములు ఖర్చులు, బాకీలును, యీ ఆక్టు ప్రకారము చెల్లించుకొనవలె నని శాసింపబడిన యన్నిజీతములును, పై నుదహరింపబడిన రాష్ట్రముల ఆదాయముల మీదనే వసూలు చేయబడవలెను; వసూలు చేయబడును. కంపెనీవారు యికముందు తమ స్వంత యుపయోగము కొఱ

కుంచుకొను ఆస్తికిగాని లాభములకుగాని, పై అక్టువలన యీ కంపెనీవారికి ప్రత్యేకింపబడిన లాభములకుగాని లేక ఈకంపెనీ యజమానులకుగాని డైరెక్టర్లకుగాని ప్రత్యేకింపబడిన లాభములకుగాని పై ఋణములతోను, జీతములతోను, బాకీలతోను నెట్టి సంబంధమును లేదు."

పై అక్టులోని 11 వ సెక్షను కంపెనీవారికిగల ఆస్తి మీాద నూటికి $10\frac{1}{2}$ చొప్పున గ్రేటుబ్రిటనులో ప్రతి సంవత్సరము లాభములను జెల్లింపవలెననికూడ శాసించెను. కనుక నీయన్నిషరతులవల్లను భారతదేశాదాయముపై నీక్రిందిభారమంతయు మోపబడెను.

(1) ఈస్టు యిండియా కంపెనీవారియొక్క వర్తకపు పెట్టుబడి నంతను వడ్డీతోసహా చెల్లించుకొనుట.

(2) కంపెనీయొక్క రాష్ట్రఋణము నంతను చెల్లించుకొనుట.

(3) అప్పటికి కంపెనీకిగల యితరఋణములను, బాకీలను చెల్లించుకొనుట.

(4) ఆతేదీ తరువాత కంపెనీ యిచ్చుకొనవలసియుండు ఋణముల నన్నిటిని చెల్లించుకొనుట.

(5) ఆ తేదీలగాయతు కంపెనీవారు రాష్ట్రపరిపాలనకుగాను జేయు ఋణముల నన్నింటిని చెల్లించుకొనుట. 1874 వ ఏప్రిల్ 30వ తేదీ తరువాత నెప్పుడైనను పార్లమెంటువారు కంపెనీవారి ప్రతి 100 పౌనుల వర్తకపుటాస్తికిని 200పౌనులు

చెల్లించి సదరు ఆస్తిని విడుదల చేసికొనవచ్చునని 12 వ శెక్షను లో కలదు.

1874 లోపల యెప్పుడుగాని కంపెనీవారిని ప్రైరాష్ట్రి పరిపాలననుండి తొలగించుచో కంపెనీవారు 12 వ శెక్షను లోని షరతుల ప్రకారము తమయాస్తిని విడుదల చేసికొను టకు హక్కును గలిగియుందు రని 13 వ శెక్షనులో కలదు.

"ఇండియా కంపెనీవారి సెక్యూరిటీ నిధి తాలూకు అకౌంటు" అని పిలువబడు అకౌంటు పెట్టుకొని యింగ్లండు బ్యాంకులో ప్రతివత్సరమును కంపెనీవారు 20 లక్షుల పౌనులు నూటికి సంవత్సరమునకు 3½ చొప్పున కాంపౌండు వడ్డీ తో 120 లక్షుల పౌనులు (కంపెనీవారి వర్తకపు టాస్తిని విడుదల చేయుటకు కావలసిన మొత్తము) అగునంత కాలము చెల్లింపవలె నని 14 వ శెక్షనలో కలదు.

14 వ శెక్షనులో నుదహరింపబడిన 20 లక్షుల పౌనులను కంపెనీవారు ప్రతివత్సరము రాష్ట్రముల ఆదాయము నుండియే చెల్లింపవలె నని 17వ శెక్షనులో గలదు.

8. కంపెనీవారి ఋణము, 1857.— భారతవ్యయము లను గురించి 1895 లో నేర్పరుపబడిన వెల్బికమీషనువారు తమరిపోర్టులో 117 వ పేరాలో నిట్లువ్రాసిరి.

" అకౌంటుసౌకర్యముకొఱకు భారత ఋణము ప్రస్తుతము రెండు భాగములుగా విభజింపబడెను. (1) సామాన్యఋణము లేక ఫలప్రదముకాని ఋణము. (2) ఫలప్రద

మైన లేక ప్రజాహితకార్యములకు చేసిన ఋణము. మేము మొదట సామాన్యఋణములను దీసికొందుము. ఈ ఋణము యొక్క గత 60 వత్సరముల చరిత్ర ప్రభుత్వాదాయములో నొకయుపయోగమైన పాఠమును బోధించుచున్నది. 1838-9 మొదలు 1861-2 వరకు ఆయముకన్న వ్యయమే హెచ్చుగుచు మిగులుట యనునది బహు అరుదయ్యెను. మొదటి 19 వత్సరములలో టుగనేయుండి చివర అయిదువత్సరములుమాత్రము బాగుండెను. కంపెనీవారి లెక్క లెంతమాత్రమును స్పష్టముగా లేకయుండెను. మొదటి సంవత్సరము లోని యంకెలను ఊజ్జాయింపుగామాత్రమే తీసికొనవలెను. కాని సర్ జార్జి బాల్బరు గారి యుపపాదనపైని 1881 లో పార్లమెంటువారి యెదుట పెట్టబడిన ఋణముల జాబితా సరిపోల్చుకొనుటకు విశ్వసింప తగియున్నదని యిండియా ఆఫీసువారు తలచుచున్నారు. అది 1857 వ సంవత్సరముతో ప్రారంభించును గనుక మనము దానినే యుపయోగించెదము. 1842 ఏప్రిల్ 30 వ తేదీనాటికి యీ దేశములో గాని హిందూదేశములో గాని చేయబడిన శాశ్వత హిందూదేశ ఋణము 3,35,77,414 పౌనులు. 1857 ఏప్రిల్ 30 వ తేదీ నాటి కనగా విప్లవమునకు ముందుగా అది 5,13,27,598 పౌనులయ్యెను. అనగా 15 వత్సరములలో నూటికి 53 చొప్పున హెచ్చెను. 1862 ఏప్రిల్ 30 వ తేదీతో విప్లవమునకైన ఖర్చులు ఆఖరయ్యెను. అప్పటికి శాశ్వత ఋణము 9,90,37,062 పౌనులయ్యెను." అనగా 20 సంవత్సరములలో నూటికి 190 చొప్పున హెచ్చెను."

**9. ఋణగ్రస్తతకు కారణము:**—పై 510 లక్షల పౌనుల ఋణ మెట్లుచేయబడెనో మన మిపుడు విచారణ చేయవలెను. 1873 లగాయతు ఈస్టు యిండియా కంపెనీపరిపాలన క్రింద నున్న రాష్ట్రములమీాద మిగులుచుండిన యాదాయమునంతను వారు తమ వర్తకశాఖ కుపయోగించుకొనుచుండిరి. చివర కది వాటాదార్లకు పంచిపెట్టబడు చుండెడిది. కాని రాష్ట్రపాలన శాఖకు జెందిన లోటులన్నియును ముద్దగా జేయబడి 1857 ఏప్రిల్ 30 వ తేదీనాటికి తేలిన 510 లక్షల పౌనుల ఋణములో నొక భాగమయ్యెను. పై నుదహరింపబడిన ప్రజాఋణము చాలవరకు యుద్ధకార్యములవంటి కార్యములకును, రాష్ట్రముల నార్జించుటకును జేయబడెను.

ఈ కాలములో దేశములోనే చేయబడిన యుద్ధముల కైన ఖర్చులకుగా ఈ యుద్ధములవలన సంపాదింపబడిన రాష్ట్రములకును లేక యాక్రమింపబడిన దేశములనుండి దండు కొనబడిన కప్పములు లేక యుద్ధనష్టపరిహారములకుగా చెల్లుపెట్టు కొనవచ్చును. నానాటికి మొత్తపుఖర్చులు హెచ్చుచుండి నను ఆదాయములు కూడ నట్లే హెచ్చుచున్నందున సరిపడియే యుండెను. రాష్ట్రపరిపాలనశాఖను పోను మిగిలిన హెచ్చు ఆదాయమంతయు వర్తకశాఖకు లాగి చేయబడి మిగిలి వేయ బడెను. ఈవిధానమే యవలంబింపబడనిచో యుద్ధములకు గూడ ప్రజాఋణమును జేయవలసిన యగత్యముండెడిది కాదు. రాష్ట్రపరిపాలనశాఖను పోను మిగిలిన హెచ్చు మొత్తములు యుద్ధఖర్చులకు సరిపోవుట యెట్లుండ యేవిధగాను

నాలోచించినను గ్రేటుబ్రిటనే యీఖర్చులను భరించవలసి యున్నది. ఈస్టుయిండియా కంపెనీయొక్క డైరెక్టర్లే యీ యుద్ధఖర్చులను భారతదేశపు ఆదాయముపై వేసి సుద్దరా దని కొన్ని సమయములందు ముక్తకంఠములతో నధిక్షేపిం చి వీనిని గ్రేటుబ్రిటనే భరింపవలెనని వాదించిరి.

10. అకౌంటుల కలగాపులగము:—ఈస్టు యిండి యాకంపెనీవారు భారతదేశమును పాలించిన కాలములో గావించిన ద్రవ్యవ్యాపారములలోని లెక్కల చిక్కులను విడ దీయుట బహుకష్టము. వర్తకశాఖకును రాష్ట్రశాఖకును జెం దిన లెక్కలను రెంటిని వారు కలగాపులగము చేసిరి. పై నుదహరింపబడిన జాతీయ ఋణములు వీరి పరిపాలనాంతముకు జెందినవే. దీనికి చాలాకాలముకు ముందే కంపెనీవారు బెం గాలు-బీహారు-ఒరిస్సాల దివానీలు మొదలగువానిని సంపా దించి, రాష్ట్రఆదాయముల రూపమున చాలధనమును సంపా దించి యుండిరి. ఇంతేకాదు. అయోధ్య నవాబు, కాశీరాజు, మొదలగు కంపెనీవారి మిత్రులనుండియు, నాశ్రితులనుండి యు వారు కప్పములను దీసికొనిరి. 1813 వ నాటి చట్టము ప్రకారము రాష్ట్రీయ ఆదాయము కొన్ని పనులకు మాత్రమే వినియోగింప బడవలెను. వాటికిపోగా మిగిలినది హాయిగా వర్తకశాఖ కుపయోగించుకొనిరి. పై చట్టముయొక్క 55 వ శెక్షను ప్రకారము రాష్ట్రీయాదాయముల నీ క్రింది కార్యముల కుపయోగింపవలెను.

(1) సేనలను కోటలను బోషించుటకును, రక్షించుట కును, యుద్ధపరికరములను నావికా పరికరములను సేకరించు కొనుటకును;

(2) భారత ఋణములమీద, అనగా కోర్టు ఆఫ్ డైరక్టర్లమీద బిల్లు రూపకముగా వసూలు చేయుబడుదానితో సహా (దీనిని రొక్క రూపకముగాగాని మరియొక విధముగాగాని యింగ్లండు పంపించుట కేసమయమందైనను సిద్ధముగా నుండుటకు వసతి నేర్పరచుకొనవలెను) వడ్డీని చెల్లించుకొనుటకును;

(3) పరిపాలన శాఖకును, వర్తక శాఖకును జెందిన యావత్తు సిబ్బందీ కగు ఖర్చుల నిచ్చుకొనుటకును;

(4) రాష్ట్రపరిపాలనకైన ఋణములను, ఇంగ్లండులో చేసిన బాండులరూపములోనున్న ఋణములను బోర్డు ఆఫ్ కమీషనర్ల యామోదముపైని కోర్టు ఆఫ్ డైరెక్టర్లు ఆదేశించు నట్టి యితరపనులకును నైన ఋణములను తీర్చుటకును.

( పార్లమెంటరీ కమిటీ రిపోర్టు, 1832 )

ఈ ఆక్టుయొక్క 56 వ శెక్షను ప్రకారము గతించు సాలుకు రాష్ట్రపరిపాలనకుగాను యింగ్లండులో వర్తకనిధినుండి చెల్లింపబడు ఖర్చులకు అంతే మొత్తమును ప్రతిసాలున వర్తక పెట్టుబడుల కొరకుగాని, యింగ్లండుపంపుటకుగాని హిందూదేశములో చెల్లించుచుండవలెను. 1832 లోని కామన్సుసభ వారి కమిటీరిపోర్టు ప్రకారము 1814-15 మొదలు 1826-27 వరకు కంపెనీవారి పెట్టుబడులను కొనుటకుగాను రాష్ట్రశాఖకు

చెందిన ధనమునుండి పంపబడిన మొత్తము సగటున 20,28,000 పౌను లయ్యెను. ఇందులో 11,55,000 పౌనులు చీనాలోని హిందూదేశపు పెట్టుబడులను కొనుటకు వినియోగింపబడెను. ఇంకను కావలసిన యితర మొత్తములకు ముఖ్యముగా చీనావర్త కములోని లాభములనుండి తీయుచు రాష్ట్రశాఖకు పెట్టుబడి పెట్టుచుండెడివారు. మరియొకచిత్రమేమనగా 57 వ సెక్షను క్రింద కంపెనీవారి ఇంగ్లండులోని వర్తక లాభము లన్నియును, ఇతర వచ్చుబడులును ఈ క్రింది పనులకు వినియోగింపబడవలెను.

(1) మారకపు బిల్లులకు చెల్లించుటకును,

(2) వర్తకపు ఖర్చులకును, ఇంగ్లండులో బాండు రూపములోనున్న ఋణములమీద వడ్డీకిని గాక యితర ఋణముల తాత్కాలికపు వసూళ్ళకును;

(3) లాభములను పంచుటకును;

(4) భారత ఋణమునుగాని యింగ్లండులోని బాండు ఋణమునుగాని తగ్గించుటకును.

ఈ విధముగా నొకశాఖనుండి మరియొకశాఖకు ఇచ్చిపుచ్చుకొనుటలు జరుగుచుండుటవలన నీ రెండుశాఖల యొక్క వేర్వేరు అక్కౌంటు లెంతమాత్రమును స్పష్టముగా లేవు. కనుక పరిశోధకు లీ సమయములో జేయతగినది కంపెనీవారి పరిపాలనాంతమునకు చూపబడిన మొత్తమును (చరిత్ర)వలన తెల్లమగునట్టి కొన్ని యంశములలో తగిన

సర్దుబాటులు చేసికొనుచు) పరిగణించుట తప్ప మరేమియు గాన్పించదు. 1784,1793,1813,1833,1853 సంవత్సరములలో చేయబడిన చట్టములకు పూర్వము కంపెనీవారి వ్యాపారములను అప్పుడప్పుడు పరిశోధించిన పార్లమెంటరీ కమిటీవారి పరిశోధనలే మనకు కొంత దిక్కుగుచున్నవి 1833 లో కంపెనీ వారి వర్తకపుహక్కులును, అధికారములును పూర్తిగా లాగివేయబడినపుడు ఈ లెక్కలు కూలంకషముగా తనిఖీచేయబడెను. 1832 లో పార్లమెంటరీ కమిటీవారు పెన్నింగుటను అను నొక పక్కా లెక్కగానిని ప్రత్యేక పరిశోధకునిగా నియమించిరి అతడు తన రిపోర్టులో నిట్లు వ్రాసెను.

"ప్రస్తుత పట్టాపుట్టుటకు పూర్వము కంపెనీవారి వ్యాపారములలోని రెండుశాఖలకును గల సంబంధమును పరిశోధించు సందర్భములో పుట్టబడిన వాదము లన్నింటికిని వాని సూత్రములలోనేమి, వివరములలోను ఫలితములలోను నేమి, పరస్పరవైరుధ్యమేకాని సమన్వయ మెంతమాత్రమును కాన్పించదు. పై అకౌంటులవలన పుట్టిన యీవాదము లేవిషయమును గురించికాని ధ్రువమైన సారాంశమును తీయుటతి కష్టము లేక అసాధ్యము అనియే చూపుచున్నవి. అవి మంచి యుదాహరణములును గావు; ఋజువులును గావు."

ఈ లెక్కలు ఈస్టు యిండియా కంపెనీ డైరెక్టర్లు తమ్ము తాము సమర్థించుకొనునట్టి దృక్పథమునకు లోబడి యుండును. కంపెనీ డైరెక్టర్లు మొట్టమొదట తామే భరించిన కొన్నిఖర్చులు అనగా 113 లక్షల పౌనులు భారతదే

శము భరించరాదనియు నింగ్లండే భరింపవలెననియు చాల కాలమునుండి పట్టుపట్టుచుండిరి.

ఈ చిక్కులటుండ తరువాత పేరాలను చూచితిమేని 1857 ఏప్రియలు 30 వ తేదీకి తేల్చబడిన ప్రజాఋణములో పూర్తిగా కాకపోయినను చాలవరకు భారతదేశమున కెంత మాత్రమును సంబంధించని విషయములకే ఖర్చుపెట్టబడినట్లు విశదముకాగలదు. ఇంతేకాక గవర్నరుజనరల్ మొదలుకొని క్రిందవరకును భారతదేశముపై నెంతమాత్రమును రుద్దరాని పెద్ద పెద్ద మొత్తములకు పింఛనుల, బహుమతుల, విరాళముల రూపకముగా కంపెనీయొక్క సైనిక, పరిపాలనా శాఖలకు జెందిన నౌకర్లకు మస్తుగా బంచిపెట్టబడెను. * కాని యీ రిపోర్టులో తర్కింపబడిన యంశములలో వీనిని జేర్చ నైనను జేర్చలేదు.

---

* "ఈ క్రింది మొత్తములు పింఛనులుగను బహుమతులుగను బ్రసాదం పబడెను క్లయివుకు తన జాగీరుమీద వచ్చు రాబడియంతయును, మార్క్విసు ఆఫ్ కార్న్వాలీసుకు సాలుకు 5000 పౌనులును, వారన్ హేస్టింగ్సుకు తన న్యాయశాస్త్ర పరత్వకైన ఖర్చులు 71,080 పౌనులును, 50,000 పౌనులు ఋణమును గాక సాలీనా 4000 పౌనులు; మార్క్విసు ఆఫ్ వెలస్లీకి సాలీనా 5000 పౌనులు, సర్ జాన్ మాక్ఫరుసనుకు సాలీనా 1000 పౌనులు, సర్ జార్జి బార్లోకు సాలీనా 1500 పౌనులు, మార్క్విసు ఆఫ్ హేస్టింగ్సుకు 60,000 పౌనులు యేకముద్దయు, హార్డింజి ప్రభువుకు సాలీనా 5000 పౌనులు;

(బెనర్జిగారి భారత ఆయవ్యయము)

"ముఖ్యసైనికాధిపతి తన జీతమును, అనేక యితర అలవెన్సులును గాక కమిషనులో $7\frac{1}{2}$ వాటాలు గలిగియుండెను. ముఖ్యసైనికాధిపతి కతడు గవ

**11. దేశాంతర యుద్ధములు:—** కంపెనీవారు హిందూ దేశ సరిహద్దులను దాటి చేసిన యుద్ధముల సందర్భములో హిందూ దేశముమీద గట్టిన ఖర్చులను సరిగా నిరూపించుట చాల కష్టము. మొదటి ఆఫ్ఘను యుద్ధముకు 150 లక్ష లయ్యెను. 1825-26, 1852–55 లలో జరిగిన మొదటి రెండు బర్మాయుద్ధములకు సుమారు 140 లక్షలు అంచనా వేయబడెను. చీనా పరిష్యా, నేపాలు దేశములకు బోయిన చిన్నచిన్న దండయాత్రలకు 60 లక్షలయ్యెను కనుక మొత్తముమీద నీ యుద్ధములకు 350 లక్ష లయ్యెను. ఈ మొత్తమును హిందూదేశాదాయముపై విధించుట యన్యాయము. ఏలయన నీ యుద్ధములు హిందూదేశసరిహద్దులను దాటి బ్రిటిషు ప్రయోజనముల కొఱకు, అప్పటి బ్రిటిషుమంత్రుల సలహాలపైన జేయబడెను. వీనివలన హిందూదేశమున కావంతయు లాభము కలుగ లేదు. సర్ జార్జి వింగేటు యిట్లు వ్రాసెను:—

"మన సామ్రాజ్య సరిహద్దులను దాటి ఆసియా ఖండములో మనము జఱపిన యుద్ధములు చాలవరకు, వాటియు

---

గ్నరు జనరల్ సభలో సభ్యు డగుటచే వచ్చు 10,000 పౌనులు జీతముగాక అతని హోదాకు సరిపోవు భవనము నతని వసతి కీయవలెననియు, సంవత్సరమునకు ప్రయాణఖర్చులకు గాను 60,00 పౌనులు అనగా 60000 రూపాయిల నివ్వవలెననియు 1774 లో కోర్టు ఆఫ్ డైరెక్టర్లు హుకుం జారీచేసిరి. చిత్రమేమనగా సైనికశాఖాధిపతి కిదియును చాలలేదు. కనుక 1779లో గవర్నరు జనరల్ సభలో సర్ ఐర్‌కూటుకు (అప్పటి సైన్యాధిపతి) మజ్జనభోజన భాజనాదికములకు నెలకు 7500 రూపాయిలను యుద్ధభూమిలో నున్నపుడు ప్రయాణఖర్చులు మొదలగువానికి 6326 రూపాయిలును మంజూరుచేయబడెను (పే. 345)

ద్దేశములు కొన్ని సందర్భములలో బూ ర్తిగా బ్రిటను ప్రయోజనములకై నను, కొన్నింటిలో నెక్కడో కొంచెము భారత సంబంధమున్నను, భారత ప్రభుత్వమువారి సైన్యసహాయముచేతను, ధనసహాయముచేతను నడుపబడెను. ఇండియా ప్రభుత్వమువారీ యుద్ధములను బోర్డు ఆఫ్ కంట్రోలుయొక్క అధ్యక్షునిద్వారా అధికారమును చలాయించుచుండునట్టి అప్పటి బ్రిటిషుమంత్రివర్గమువారి యాజ్ఞలను శిరసావహించియే చేసిరి. వీటివలన కలిగిన ఫలితములన్నింటికి బ్రిటిషుజాతిదే బాధ్యత యని వేఱుగ జెప్పనక్కరలేదు. ఆఫ్ఘనుయుద్ధము వీటిలో నతిముఖ్యమైనది. ఈ యుద్ధము కోర్టుఆఫ్ డైరెక్టర్ల యనుమతి లేకుండ, వారి యభిప్రాయములకు వ్యతిరేకముగ జరుపబడినట్లు ఇప్పుడు జగద్విదితమయ్యెను. ఇది కేవలము బ్రిటిషుయుద్ధము. దీనిని సరకుచేయకపోవుటే కాక కోర్టు ఆఫ్ డైరెక్టర్లందరియొక్క యేకాభిప్రాయమును దిగదుడిచి, యీ యుద్ధఖర్చుల నన్నిటిని భారతదేశముపై వేసి కట్టరాదని కంపెనీయొక్క కోర్టు ఆఫ్ ప్రొప్రయిటర్ల తీర్మానమునకు వ్యతిరేకముగా మంత్రివర్గమువారు దీనిని భారతదేశముపై రుద్దిరి. ఈ యన్యాయమువలన భారతదేశమునకు 100 లక్షలఋణము పెరిగెను. గతపరిష్యను యుద్ధము హిందూదేశమున కెంతమాత్రమును నిజమైన సంబంధములేని నీతి ననుసరించి బ్రిటిషు మంత్రివర్గమువారిచే ప్రకటింపబడెను. కాని యుద్ధముమాత్రము భారత సైన్యముచేతను ధనముచేతను నడుపబడెను. చివర కీయుద్ధమునకైన మొత్తపు ఖర్చులలో

నీ దేశము సగముమాత్రమే భరించెను. మన మాసియా ఖండములో జరిపిన యుద్ధము లన్నింటికిని భారతదేశ ధన సైన్యములు పిండబడెను. కాని యీవిధముగా జరుపబడిన సహాయముల కేయొక్క సందర్భములోనైనను బూర్తియైన విలువ భారతదేశమునకు చెల్లింపబడలేదు. భారతదేశముపట్ల మన నీతి పక్షపాతముతోను, స్వార్థపరత్వముతోను గూడు కొని యున్నదని చెప్పుట కింతకంటె వేరు నిదర్శన మక్కర లేదు."

(మనకు భారతదేశమునకు గల ధనసంబంధములు పే. 17-19.)

1842 ఏప్రిల్ 6 వ తేదీని కంపెనియొక్క అధ్యక్షు, యుపాధ్యక్షులుగలసి ఫిట్జుగిరాల్డు ప్రభువునకు వ్రాసిన లేఖ లోని భాగ మీక్రింద పొందు పరుపబడినది.

"అఫ్ఘను దండయాత్రకు బూర్వము భారతాయవ్య యములు చాల బాగుండెననియు, చాలమొత్తము మిగులు చుండెడిదనియు ప్రభువా రెరుంగుదురు. ఇప్పుడు ప్రతి వత్సరము చాల లోటువచ్చుచున్నదనియు దీనికి వత్సరమునకు నూటికి 5 చొ॥ వడ్డీతో ఋణము చేయబడినదనియు మీరెరుం గుదురు. ఇట్టి పరిస్థితులలో న్యాయబుద్ధితోను నిష్పక్షపాత బుద్ధితోను చూచినచో భారతదేశముపై వేయరాని ఋణ ములను తొలగించవలసినదని భారతదేశముతరపున కోరుట కోర్టువారి ధర్మమైయున్నది. సింధునదీతీరములను దాటి చేసిన దండయాత్రల యుద్దేశములను గురించి యకాలములోనే తర్కించుట కోర్టువారి కోరిక కాకపోయినను ఎవ్విధముగా

చూచినను ఈ యుద్ధములకైన ఖర్చునంతను, ఇకముందు క్రొత్తగా జేర్చబోవు సైన్యములకగు ఖర్చులను కలుపుకొని భారతదేశముపై వేయుట న్యాయముకాని యవసరము కాని కాజాలదు.

(మనకు భారతదేశముతో గల ధన సంబంధములు, పే. 18)

1842 జూన్ 27వ తేదీని కంపెనీయొక్క జనరల్ కోర్టు వారీ విషయమై చేసిన తీర్మానము నీ క్రింద పొందుపరచు చున్నాము.

"పార్లమెంటుయెదుట పెట్టబడిన కాగితముల వలన ఆఫ్ఘనుస్థాన వ్యవహారములలో బ్రిటిషువారు కలుగచేసికొను టకు గల పరిస్థితుల నన్నింటిని విచారించి చూచినమీదట ఆ యుద్ధముకైన ఖర్చులనన్నింటిని భారతదేశముపై కట్టరాదని యు, నందులో కొంతభాగమును బ్రిటిషు ఖజానా భరించవలె ననియు నీ కోర్టువారి యభిప్రాయమైయున్నది."

(మనకు భారతదేశముతోగల ధన సంబంధములు, పే. 19)

ఈ విషయమును చర్చించుటలో మేము భారతదేశము ధన, జనరూపకముగా నిజముగా ననుభవించిన నష్టమునంతను భారతదేశములో స్థిరముగా నేటికిని నిలిచియున్న సైన్య పోషణమునకగు ఖర్చును (ఇదియే చాల హెచ్చుగా నున్నది.) లెక్కపెట్టనేలేదు. కామన్సుసభలో జాన్‌బ్రైటు చెప్పిన మాటల నీ సందర్భములో నుదహరించుట యవసరము.

"ఆఫ్ఘనుయుద్ధమునకైన యమితమగు ఖర్చులనుగురించి నేను గతసాలున నుదహరించియే యుంటిని. దీనిని బ్రిటిషు

మంత్రివర్గమువారు బ్రిటిషు ప్రయోజనము లనుకొనబడిన వాటికొరకు సమర్థించిరి. కనుక దీని నిజమైన భారమంతయు నాంగ్లప్రజలమీదనే పడవలెను."

(దత్తుగారి భారతదేశచరిత్ర, పే. 217)

**12.** వర్తక పెట్టుబడి విడుదల—1858 వ సంవత్సరములో కంపెనీవారు రాష్ట్రపరిపాలనమునుండి తొలగింపబడినపుడు 1833 లోని పట్టాచట్టముయొక్క 13వ సెక్షనుప్రకారము 120 లక్షల పౌనులను కంపెనీవారికిచ్చి వారి యాస్తిని విడుదల చేయవలెను. కాని 1874 వరకును కంపెనీ యాస్తిని విడుదలచేయక పోవుటచే నాతేదీవరకును సంవత్సరమునకు నూటికి $10\frac{1}{2}$ చొప్పున లాభములు ముట్ట చెప్పబడెను. ఈ మొత్తము సంవత్సరమునకు 6,30,000 పౌనులయ్యెను. ఈ మొత్తము భారతదేశాదాయమునుండి సమర్పింపబడెను. కనుక నీమరతులవలన నీ క్రింది మొత్తములు భారతదేశముపై రుద్దబడెను.

| | | |
|---|---|---|
| లాభములు | 1833 — 58 | 15,120,000 |
| | 1858 — 74 | 10,080,000 |
| వర్తకపుటాస్తి విడుదల | | 12,000,000 |
| | పౌనులు | 37,200,000 |

భారతదేశముపై బడిన యీభారమునకు భారతదేశమునకావంతయు లాభము కలుగచేయబడలేదు. ఇది హిందూదేశములో వారికున్న వర్తకహక్కులను, ఆస్తులను వారు వదలు

కొనుటకుగాను ఈస్టు యిండియా కంపెనీవారి కిచ్చిన మూల్య మగుచున్నది. ఇది ఈస్టుయిండియా కంపెనీ డైరెక్టర్లును, యజమానులును బ్రిటిషుప్రజలకును, పార్లమెంటుకును ప్రతినిధులైన బ్రిటిషుప్రభుత్వమును కలిసి చేసికొనిన యేర్పాటువలన నేర్పడిన ఫలితము. దీనిలో భారతప్రజల కెంతమాత్రమును చోటిచ్చియుండలేదు. వారి ప్రయోజనములనుకూడ యోచించియుండలేదు. ఇట్టి యేకకక్షవారు గావించుకొనిన యేర్పాటు న్యాయబుద్ధితోను, నిర్మలాంతఃకరణతోను చూచితిమేని భారతప్రజలను బంధింపజాలదు. ఇది వరలో నుదహరింప బడినట్లు బ్రిటిషుప్రభుత్వమునకును కంపెనీ డైరెక్టర్లకును జరిగిన యేర్పాట్ల ప్రకారము మంచి విలువ గలవని చెప్పబడి కంపెనీ వారిచే వదులుకొనబడిన వారి యాస్తిరూపకముగ గాని, స్వదేశ ప్రభుత్వము మీద పూర్ణాధికార ముండుటచే గలుగు నేవిధమైన ప్రత్యేక లాభముల పూర్వకముగగాని లేక సేవచేయుటకుగల యవకాశములలో న్యాయమైనభాగము నిచ్చుటచేగాని, దేశసంపత్తు నభివృద్ధిచేయుట ద్వారాగాని, యే రూపకముగాను భారత దేశమున కెట్టి లాభమును గలుగలేదు. కంపెనీ పరిపాలనకాల మంతటిలోను తమ దేశములోనే భారతప్రజల కెట్టిహక్కులు శూన్యమయ్యెను. ఇక వర్తకసంఘముగను, పరిపాలక సంఘముగను కంపెనీవారు చేసిన చేష్టలవలన బ్రిటిషు ప్రభుత్వమున కనేక లాభములు చేకూరెను చీనాతోసహా తూర్పుదీవులతో వర్తకము జేసికొనుటకు కంపెనీవారి కిచ్చిన వర్తక పట్టాకు ప్రతి

ఫలముగా 18 వ శతాబ్ద మంతటిలోను నవసరమగునపుడెల్ల కంపెనీవారు బ్రిటిషు ప్రభుత్వమున కడ్డుపడుచు నమూల్య సహాయము నొనరించిరి. కంపెనీవారి వర్తకపుటాస్తికిని, ప్రతిష్ఠకును ముదరా చెప్పవలె నని నిర్మలాంతఃకరణయు, న్యాయదేవతయు పలుకవలసినచో దానిని భారతప్రజలు కాక బ్రిటిషుప్రజలే భరించవలసియున్నది.

మా వాదము నింకను బలపర్చుటకు నైగీరియను రాష్ట్రియుదాహరణమును క్లుప్తపరచెదము. ఇది యొక పట్టా పొందిన కంపెనీవారిరాష్ట్రము. దీనిని బ్రిటిషుప్రభుత్వము వారు తమ స్వంతపరిపాలనక్రిందకు తీసికొనిరి. యునైటెడ్ ఆఫ్రికాను కంపెనీ 1886 లో రాజుగారిపట్టాక్రింద రోయల్ నైగర్ కంపెనీ యయ్యెను. ఈ పట్టావలన పశ్చిమఆఫ్రికా లోని కొన్ని రాష్ట్రములు కంపెనీ యధీనములో నుంచబడెను. దాని ప్రకారము కంపెనీవారీరాష్ట్రపరిపాలనను ప్రారంభించి ఈస్టు యిండియా కంపెనీవారివలెనే చుట్టు ప్రక్కలనున్న సంస్థానములతో యుద్ధములు, ఒడంబడికలు చేసికొనుచు దేశ ప్రజలపై పాశ్చాత్యప్రభుత్వమును నెలకొలిపిరి. కాని ఫ్రెంచి, జర్మను ప్రభుత్వములు రెండును రెండువైపులనుండి వత్తిడి చేయుచుండుటచే కంపెనీవారు తమస్వంతధన సంపత్తుతో నీయొత్తిడికి తాళజాలకపోయిరి. ఇట్టి పరిస్థితులలో వారి సొంతహక్కులకు గాను 565,000 పౌనులు బ్రిటిషుఖజానా నుండి కంపెనీవారికి చెల్లించినమీదట కంపెనీవారు తమ

పట్టాను, అన్ని రాజకీయహక్కులను బ్రిటిషుప్రభుత్వమున కిచ్చివేయుట కేర్పాటుచేసి కొనిరి.

ఈ యేర్పాటు 1900 సంవత్సరం జనవరి 1వ తేదీని జరిగెను. కంపెనీ అప్పుడే "రోయల్" అను పదమును విసర్జించి కేవల మొక వర్తకసంఘ మయ్యెను.

ఇందులో గమనింపవలసిన ముఖ్యవిషయము లేవియన గా: (1) స్వంతముగా బయలుదేరి రాష్ట్రములను సంపాదించిన యొక సంఘమునకు గల స్వంతహక్కులను విడిచి పెట్టుటకు మాత్రమే దానికి ప్రతిఫలము నీయవలెను (2) ఈ రాష్ట్రములను తీసికొను లేక కొనుక్కొను దేశముయొక్క ఖజానానుండి యే యీసొమ్ము నీయవలెను. కాని రాష్ట్రములనుండియే దీనిని గుంజుకొనరాదు. భారతదేశము విషయములో ఈస్టు యిండియా కంపెనీవారినుండి రాష్ట్రాధికారములను బ్రిటిషుప్రభుత్వము వారు తీసికొనినపుడు దాని వర్తకపు (స్వంత) ఆస్తికిని అధికారములకును రాజకీయ హక్కులకును కూడ నపరిమితమైన ధన మీయబడెను. భారతప్రజల యనుమతిగాని వారలతో నాలోచనగాని యక్కరలేకుండ బ్రిటిషు ప్రభుత్వము వారీ ధనమును భారతదేశముపై విధించిరి.

**13.** "తిరుగుబాటు" కైనఖర్చు - 1857-58 లో జరిగిన సైనికవ్యయము 400 లక్షల పౌనులు. దీనిని భారతదేశ ఋణమున కంటగట్టిరి దీనిని గురించి సర్ జార్జి వింగేటు యిట్లు చెప్పెను.

"బ్రిటిషు ప్రజలు గొప్పగొప్ప త్యాగములను చేయ వలసిన యవసర మెన్నడైనను కలిగినచో నాంగ్లసామ్రాజ్యము కంతకును మణిపూస మన చేతులనుండి జారిపోవు నీ తరుణమునకన్న వేరు తరుణము లేదు. ఇట్టి సంకటసమయములో గూడ స్వార్థసాంప్రదాయములతో గూడిన మన మామూలు భారతనీతియే నాట్యమాడెను. మన సామ్రాజ్యమునే నిలుపు కొనుటకు జరిగిన విషమయుద్ధమునకైన ఖర్చునంతను కని విని యెరుగని, సాటిలేని నైచ్యముతో (నదివరకే తల మునిగి యున్న) భారతదేశాదాయముపై వేయుటకు ప్రయత్నించితిమి"

(భారతదేశముతో మనకుగల ధనసంబంధములు, పే. 13)

"భారతవిప్లవ విషాద సమయమున, భారతదేశాదాయము దుర్భరస్థితిలో నుండగా, భారతదేశమునకు పంపబడిన యదనపు సైన్యముల కాంగ్లతీరములను వీడిన తేదీనుండి యైనఖర్చుల నన్నింటిని మాత్రమేగాక అతఃపూర్వ మా సైన్యములారు మాసములనుండి యీ దేశములో జేయుచున్న నౌకరీకైనజీత బత్తెములనుగూడ గ్రేటుబ్రిటను భారతదేశముపై రుద్దెను. జయింపబడిన రోమనులనుండి కప్పమును గుంజుకొనుచు దానిని నిర్ణయించు త్రాసులో బ్రెన్నసు తనఖడ్గమునుకూడ వేయుటను స్మరింపజేయు పద్ధతిలోగూడ తగు కారణము లుండవచ్చును. కాని మనుష్యులా మనకు సేవజేసిరి, వారి కీ సమయములో నీయబడిన జీతములా యీరాజ్యములోని పారిశ్రామిక తరగతుల సంరక్షణార్థమే వినియోగింపబడెను! దీని వలన హిందూ దేశమున కెట్టిలాభమును కలుగలేదు. ఇట్టి పరిస్థితులలో నిది

వంకే యతిభారముచే కుంగుచున్న భారతదేశముపై నీయధికభారమును వేయుటలో మనకెట్టి న్యాయసూత్రములు, లేక వ్యాపారధర్మములు, కలవో వెల్లడిచేయవలసిన నైతిక బాధ్యత మనపై గలదు.

"బ్రిటిషుసైన్యములను భారతదేశమునకు పంపుటకైన దారిఖర్చులుగూడ భారతదేశముమీదనే విధించిరి. కాని యీ ఖర్చులంతయు బ్రిటిషు నావికాయజమానులకే వినియోగపడుటచేతను, భారతదేశములో బ్రిటిషు ప్రభుత్వమును స్థాపించుటకే చేయబడినందునను మనము మరే యితర ఆశ్రిత రాష్ట్రములకు సైన్యములను బంపుచున్నను చేసినట్లే బ్రిటిషు ఖజానానుండియే దీనిని భరించుట ధర్మమును సహేతుకమును నైయున్నది."

(భారతదేశముతో మనకుగల ద్రవ్యసంబంధములు, పే. 15-16)

1859 మార్చిలో జాన్‌బ్రైటు ఈస్టుఇండియా ఋణమును గురించి యిట్లుచెప్పెను:—

"విప్లవమునకైన 400 లక్షల పౌనులను భారతప్రజలపై వేయుట విచారకరము. పార్లమెంటుయొక్కయు బ్రిటిషుప్రజలయొక్కయు నసమర్థ వ్యాపారమువలననే యీ విప్లవము కలిగెను. న్యాయమనునది యొక్కటైనను మానవులకు జరిగియుండినచో నిస్సందేహముగా నీ 400 లక్షల పౌనులును ఈ దేశప్రజలు చెల్లించుపన్నుల నుండియే చెల్లింపబడవలసి యున్నది."

(దత్తుగారి విక్టోరియా యుగములోని భారతదేశము, పే. 219).

పై నుదహరింపబడిన సర్ జార్జివింగేటు, జాన్‌బ్రైటు గార్ల వాదము లీభారము భారతదేశముపై మోపబడరాదను వాదము నే సమర్థించుచున్నవి.

అసమర్థ పరిపాలనవిషయ మటుండ, ఈ ఖర్చులను హిందూదేశమును తిరిగి జయించుట కైనఖర్చులనుగా భావించి గ్రేటు బ్రిటనే భరింపవలసియున్నది 1857-58 నాటి ఖర్చులవంటి ఖర్చుల నాంగ్లదేశమే యెట్లు భరించవలెనో భారతదేశ శక్రెటరీగారి మాటలవల్లనే తెల్లమగుచున్నది. 1872 ఏప్రిల్ 14 వ తేదీని యుద్ధకార్యాలయము వారు పంపిన యుత్తరమునకు సమాధాన మిచ్చుచు 1872 అగష్టు 8 వ తేదీన వారిట్లు వ్రాసిరి. "1857-58 లోని యసాధారణవిప్లవ మొక్కటి మాత్రమే యుద్ధకార్యాలయావశ్యకతకు గొంచె మాస్కారము నైనను నిచ్చుచున్నది.

ఇండియా దేశములో కని విని యెఱుగని యీ విప్లవములో, ప్రాచ్యదేశములో తన సామ్రాజ్యమునకే నీళ్ళు విడువవలసి వచ్చుటచే సామ్రాజ్య ప్రభుత్వము వారు ఈ సంకటము నెదుర్కొనవలసివచ్చెను. రాణిగారి యితర వలస ప్రభుత్వములలో నెచ్చటనైనను సరిగా నిట్టి యుద్ధ ప్రయత్నమే యవసరమైనయెడల దానినిచేయుటయేగాక దాని కగుఖర్చులో సగమునకుము చాలవరకైనను సామ్రాజ్య ప్రభుత్వమే భరింపవలెను. కాని భారతవిప్లవ సందర్భములో దాని నణచివేయుటకైన ఖర్చులో నెంతమాత్రమును సామ్రాజ్య బొక్కసముపై

పడలేదు. ఆమొత్తమును పన్ను చెల్లించు ప్రతి భారతీయుడును చెల్లించెను, లేక నింకను చెల్లించుచున్నాడు."

(భారతవ్యయపరిశీలనా కమిషను 1895 2వ వాల్యూం, పే.292)

ట్రాన్సువాలు జయింపబడినపుడు బోయరు యుద్ధఖర్చుసందర్భములో గ్రేటుబిటను పై సూత్రము నంగీకరించెను. ఈ యుద్ధమునకు బ్రిటిషువారికైన ఖర్చులు ట్రాన్సువాలురాష్ట్రమేర్పడిన తరువాత నా రాష్ట్రమునుండిగాని, దక్షిణాఫ్రికా యూనియను యేర్పరచబడినపుడు దానికైన ఖర్చులు దానినుండిగాని, వసూలు చేయబడలేదు. బ్రిటను ఖర్చులను తాను భరించుటేగాక వీరీనిగింగుసంధిప్రకార మంతవరకును శత్రువులుగా నున్నబోయరులకు (నాశనమైన వారి వ్యవసాయాభివృద్ధికిగాను) 30 లక్షల పౌనులు చెల్లించుటకు గూడ నంగీకరించెను. ట్రాన్సువాలు జయింపబడిన తరువాత నా రాష్ట్రమునుండి బ్రిటనున కావంతయు లాభము చెకూరినట్లు కాన్పించదు. 1858 తరువాత బ్రిటను భారత దేశముపై ప్రభుత్వము నవిచ్ఛిన్నముగా చెలాయించుచుండుటయే గాక దానివలనను, దాని ద్వారాను గణింప శక్యముకాని లాభమును పొందెను.

ఇట్టి మరియొక యుదాహరణము తీసికొందము. 1838-43 లో కనడా విప్లవము నణచుటకైన ఖర్చులను గ్రేటుబ్రిటనే భరించెను.

కనుక ఈ విధముగా ఈస్టుఇండియాకంపెనీద్వారా హిందూ దేశముపై బడిన మొత్తము 1120 లక్షల పౌను లయ్యెను.

| | పౌనులు. |
| --- | --- |
| మొదటి ఆఫ్ఘను యుద్ధము | 15,000,000 |
| రెండు బర్మా యుద్ధములు | 14,000,000 |
| చీనా, పరిష్యాలపై దాడి | 6,000,000 |
| కంపెనీవారి పెట్టుబడికి లాభములకు (పేరా 12) | 37,200,000 |
| తిరుగు బాటుఖర్చులు | 40,000,000 |
| మొత్తము పౌ. | 112,000,000 |

భారతదేశ మిపుడు తన పైని న్యాయముగా మోప బడిన వ్యయభారములనుండి విముక్తిని కోరుట న్యాయము, ధర్మయుతము.

# మూడవ భాగము

బ్రిటిషు ప్రభుత్వముక్రింద — "ఫలోత్పత్తిలేని" ఋణము.

14. నేటి భారతప్రజాఋణము:—మన మిపుడు 1858 తరువాత భారతప్రభుత్వము వారి ధనవ్యాపారములను గమనింతము. నేటివరకు నిలిచియున్న మొత్తపుఋణమును, తాత్కాలిక నిలవఋణములను కలిపి, సూచించు (బి పెద్ద్యాలు) పట్టీ ముందులో జేర్పబడినది. ఎంతవ్యాపారము జరిగెనో, దానివలన నెంతఋణము కట్టబడెనో తెలిసికొనుట కిది సాధనభూతముగ నుండగలదు. ఈ పట్టీలోనియంకెలు ఈస్టు ఇండియా కంపెనీవా రంద చేసినఋణములను కూడ చూపుచున్నవి.

—* ప్రజాఋణముల సంగ్రహము *—

భారతదేశములో.

| 1931 జనవరి 31 వ తేదీకిగల రూపాయి ఋణములు. | కోట్లు |
|---|---|
| తాత్కాలిక ఋణము, నిలవ కాని ఋణము | 202.37 |
| అంతముగల ఋణములు | 289.07 |
| అంతము కాని ఋణములు | 125.52 |
| రైల్వే ఋణములు | 2.97 |
| వడ్డీలేని ఋణములు | 0 68 |
| రూ. | 620.61 |

ఇంగ్లండులో:

| పౌను ఋణములు. | పౌనులు. | రూపాయిలు. |
|---|---|---|
| 1931 మార్చి 31 వ తేదీకి | 2927 లక్షలు. 18 పె. చొ॥ | 3902 6 లక్షలు |
| 1930 మార్చి 31 వ తేదికి యుద్ధవిరాళములు. | 161.3 ,, | |
| రైల్వే వార్షికములు | 518.6 ,, | |
| ఇండియా బిల్లులు | 60.0 ,, | |
| ప్రావిడెంటు ఫండులు | 26.6 ,, | |
| మొత్తము | 766.5 ,, | 1022 0 ,, |

పై పట్టీలోని ఋణము లే దేశములో లేక యే నాణెములో చేయబడినవో విభజింపబడినవి. "ఫలోత్పత్తి" కల ఋణములు "ఫలోత్పత్తి లేని" ఋణములు అను మరియొక విభజనకలదు. పైవిభజనలో నిది సూచింపబడలేదు. ఈ క్రింది యంకెలు ఫలోత్పత్తిగల ఋణములను చూపుచున్నవి:—

| వడ్డీనిచ్చుచున్న ఆస్తి 1930 మార్చి 31 తేదీకి. | | కోట్లు. |
|---|---|---|
| రైల్వేల కిచ్చిన పెట్టుబడి | ... | 731.90 |
| ఇతరవర్తకశాఖల కిచ్చిన పెట్టుబడి | ... | 23.05 |
| రాష్ట్రములకిచ్చిన పెట్టుబడి | ... | 142 45 |
| భారత సంస్థానములకు, వడ్డీ నిచ్చు నితర ఋణములకు పెట్టుబడి. | ... | 17.57 |
| | | రూ 914.97 |

| ట్రెజరీ అకౌంటుమీద నున్న రొక్కము, వెండి బంగారములు, సెక్యూరిటీలు | రూ 46.78 |
|---|---|

పై ఆస్తి క్రిందకురాని వడ్డీ చెల్లించవలసిన ఋణములు } రూ 176.48

పై యంకెలు 1930 మార్చి మాసాంతమునకు గల ఫలోత్పత్తిగల ఆస్తియొక్క అంచనావిలువను తెలియజేయుచున్నవి. ఇతర వర్తకశాఖలకు పెట్టుబడి (23 కోట్లు), రాష్ట్రములకు 142.45, భారత సంస్థానములకు 17.57 (మొత్తము 183). యథార్థముగ కీపెట్టబడి యంతయు అధమపక్షము దీనికగు వడ్డీకిగాని, యీ ఋణములకొఱ కేర్పరుపబడిన మినుపు డునిధికొఱకుగాని సరిపోవుఆదాయము నిచ్చుఆస్తిని కలిగియుండ లేదు. ఇతరవర్తకశాఖలలో ముఖ్యముగా తపాలా, తంతి కలవు. వీటిపైనున్న ఋణ మంతయు నిజముగా ఫలము నొసగునది కాదు. రాష్ట్రఋణములలో నీటిపారుదలశాఖమీద కూడ పెట్టబడి కలదు ఇది నిజముగా ఫలయుక్తమైన ఆస్తి. కొ త్తఢిల్లీమీదను, బొంబాయిఅభివృద్ధికొఱకును చేసిన ఖర్చు యిట్టిది కాదు ఎట్లు చూచినను ఫలము నిచ్చునని చెప్పు 915 కోట్లు (పటసంఖ్య) లోను 850 కోట్లకంటె నెక్కువ సొమ్ము వడ్డీని, అసలును తిర్చుటకు సాలినా కొంత మొత్తమును నిచ్చు స్థితిలో లేవు. కనుక నంతవరకే ఫలయుక్తమైన ఆస్తి యనదగును.

మఱియొకసంగతి జ్ఞప్తియం దుంచుకొనవలెను. "ఫలయుక్తము, ఫలరహితము" అను విభజ ము ఆదాయవ్యయ శాఖవారి రికార్డులనుండి చేయబడిన యాచారకృతకర్మయే కాని వేరొండు కాదు. రైల్వే వార్షికములు తప్ప యీ ఋణ

మునకు సంబంధించిన ఇదమిత్థమను ఆస్తియేదియును లేదు. కనుక పైపట్టీలో నిచ్చిన విధముగా వివిధవిషయములను గుదిగుచ్చుట కవకాశము లేదు. "ఫలము" నిచ్చు ఆస్తిని చూపు పై పట్టీయైనా ఆ స్తికొఱకు నిజముగా అయిన పెట్టుబడి విలువను తెలుపుట లేదు. రైల్వేపెట్టుబడి కైనదానిలో చాలభాగము తాత్కాలిక ఆదాయమునుండియు కాటకపు భీమా గ్రాంటులనుండియు తీయబడెను. పై నచూపబడిన యంకెలో రెవిన్యూనుండి చేయబడిన యీఖర్చు బహుశః చేరియుండదు. అయినను మొత్తపుఋణమును పెంచుట కిది సహాయపడెను. ఏలయున, నీరెవిన్యూ ఈఆస్తికొఱకు ఖర్చుపెట్టబడనిచో నీ రెవిన్యూద్వారాగల హెచ్చుమొత్తము సాధారణఋణమును తగ్గించుటకుగాని, లేకుండచేయుటకు గాని వినియోగపడెడిది. పైగా 1913 కు పూర్వము చేయబడుచుండెడిసాధారణ "ఫలము లేని" ఋణములో తగ్గుదల, యనగా భారతాదాయములపై మోపబడు మొత్తపుఋణములోని తగ్గుదల, కానేరదు. భేద మేమనగా, "ఫలము" లేని సాధారణ ఋణము అని పిలువబడువానిలో నుండి తగ్గింపబడిన దానికంటె నెక్కువఋణమును గూడ "ఫలము"తో గూడిన ఋణమునకు జేర్చుటయే. ఇట్టి యంశము లన్నియు పై యంకెల నాచారముగా నేర్పడిన యంకెలను మాత్రిముగనే తీసికొనదగు నని చూపుచున్నవి. అయినను నివి భారతదేశ ఆర్థికస్థితిని పూర్తిగా గ్రహించుట కుపయోగపడుచున్నవి.

15 "ఫలము నీయని" ఋణములు:— 1858 – 1931 వరకు భారతదేశము కేవల మాంగ్ల పరిపాలనక్రిందకు వచ్చిన

తరువాత చేయబడిన "ఫలము నీయని" ఋణమును నాలుగు శీర్షికలక్రింద విభజింపవచ్చును. (1) మొట్టమొదట గణింపదగినవి యుద్ధఋణములు. వీనిని మరల రెండుభాగములుగా విభజింపవచ్చును. భారతదేశములోను దాని సరిహద్దులలోను జరుపబడిన యుద్ధములకు భారతదేశ సరిహద్దులను దాటి విదేశములలో చేసిన యుద్ధములకు, దాడులకు నయినఋణములు. (2) ఆయవ్యయములను సరిగా నిర్వహించుకొనజాలకపోవుటచే నయినఋణములు లేక అసమర్థతవలన సాధారణబడ్జటులలో నేర్పడులోటువలన కలుగుఋణములు. బ్రిటిషువారి హిందూదేశమువెలుపల నున్న రాష్ట్రముల న్యాయ సైనిక పరిపాలనలకగు ఖర్చులను హిందూదేశము భరించుచున్నది. ఇది హిందూదేశముయొక్క "ఫలోత్పత్తిలేని" ఋణములను పెంచుటకు పెట్టినది పేరు. బ్రిటిషు ప్రయోజనములను సంరక్షించుకొనుటలో హిందూదేశ సామాన్య ఆయవ్యయములలో తబ్బిబ్బులు గలిగి తద్వారా కేవలఫలరహిత మైన ఋణము దారుణముగా పెరిగిపోయెను. (3) కరవు కాటకములలో కలుగుబాధను నివారించుటకు చేసిన ఋణములు. (4) మారకములో కలిగిన నష్టమునకు చేసిన ఋణము. ఇది బడ్జెటులెక్కలలో నిరంతర కష్టములకును తద్వారా ఋణమునకు నవిరళకారణమగుచున్నది.

16. ఈక్రింది పట్టీ 1857 లగాయితు జరిగిన వివిధ యుద్ధములను, మేము నిరూపింపగలిగినంతవరకు వాటికైన ఖర్చులను వానిలో (నేదైన నున్నచో) గ్రేటుబ్రిటను భరించినభాగమును చూపుచున్నది.

## యుద్ధములను దండయాత్రలను దెలుపు పట్టి. 1857 - 1896

భారతవ్యయములను బరిశీలించుట కేర్పడిన కమిషను 1895, Vol II, పే. 305, Vol IV, పే III నుండి తయారుచేయబడినది.

| క్రీస్తుశకము | దండయాత్ర. | భారతదేశము భరించినది. | | ఇంగ్లండు భరించినది. | | చూడుడు. | మనకు రావలసిన మదరా. పౌనులు. |
|---|---|---|---|---|---|---|---|
| | | సామాన్యము | అధికము. | సామాన్యము | అధికము. | | |
| 1867 | అబిసీనియా | అంతయు | లేదు | లేదు | అంతయు | ఐ ఇ. సి Vol. III | 6,00,000 |
| 1875 | పిరాకు | అంతయు | లేదు | లేదు | కాలనీప్రభుత్వము అంతయు | ... | 41,000 |
| 1878 | 2వ ఆఫ్ఘను | అంతయు | 50 లక్షలు తప్ప అంతయు | లేదు | 50 లక్షలు | ఐ ఇ. సి. Vol III పే. 500 | 17,500,000 |
| 1882 | ఈజిప్టు | అంతయు | 5 లక్షలుతప్ప అంతయు | లేదు | 5 లక్షలు | ఐ. ఇ. సి Vol, III పే. 20 | 1,200,000 |
| 1882-92 | పశ్చిమోత్తర సరిహద్దు, చిన్నవి | | | | | ఐ.ఇ సి. Vol IV పే 187 Vol. I, పే. 222 | 18,000,000 |
| 1885 | సౌడను | అంతయు | లేదు | లేదు | అంతయు | | |
| 1886 | బర్మా | అంతయు | అంతయు | లేదు | లేదు | సి. యన్ వకీలు | 4,705,000 |
| 1896 | సకీం సౌడను | అంతయు | లేదు | లేదు | అంతయు | ఐ. ఇ. సి. Vol III పే. 23 | 200,000 |
| | | | | | | | రూపాయిలలో సుమారు 37.5 కోట్లు |

అబిసీనియా యుద్ధము, 1867:—అబిసీనియా దండయాత్ర కైన సామాన్యఖర్చులను భారతదేశముపై వేయుటను గురించి చర్చించుచు సాలిస్బరీప్రభు విట్లు చెప్పెను

"భారతదేశమును ప్రాచ్యతీరములందు ఆంగ్లసైనికాగారముగా నుంచుకొని మన కెంత సైన్యము కావలసిన నంతసైన్యమును చిల్లిగవ్వయైనను చెల్లింపనక్కరలేకుండ మనము తీసికొనుస్థితిని నేనంగీకరింపజాలను. యుద్ధములలో దిగవలెననెడు తిమ్మిరి వాటికగుఖర్చులచే మాత్రమే నియమింపబడుచున్నది. అట్టి యాటంకము లేకపోవుట యింగ్లండునకు చెట్టు; మన కెప్పుడును ముప్పు"

1872 ఆగస్టు 9వ తేదీని భారతదేశ శక్రెటరీగారు యుద్ధకార్యాలయమువారికి ఉత్తరమువ్రాయుచు నితరవిషయములతోపాటు అబిసీనియా యుద్ధమునుగురించి యిట్లువ్రాసెను.

"ఈ యుద్ధము లన్నియు పూర్తిగా సామ్రాజ్యప్రభుత్వమువారిచేతనే శాసింపబడిన వనుట జగద్విదితము. బ్రిటిషు వర్తక ప్రయోజనములు, బ్రిటిషువర్తకుల బాధలు, బ్రిటిషు ప్రభుత్వమువారి గౌరవము ఇవియే యీ యుద్ధములన్నిటికిని కారణములు"

భారతవ్యయములగురించినకమిషను, 1895: Vol. II పే 293.

ఫాసెటుకమిటీ యెందర సాక్ష్యమిచ్చుచు సర్ ఛార్లెసు ట్రివిలియను ఇట్లుచెప్పెను:—

అబిసీనియా యుద్ధము బ్రిటిషు సామ్రాజ్యమున కంతకును పట్టుకొని సామ్రాజ్యతత్త్వముచేతనే కలిగెను. నా

యభిప్రాయములో మనకును భారతదేశమునకును గల సంబంధమునకంటె మన యూరపుఅమెరికాల సంబంధమే దీని కంతకంటె నెక్కుడు కారణము. యథార్థమునకు భారతప్రజలు అబిసీనియాను గురించి యేమియు నెఱుగరు. సృష్టిలో తామెరుగని లోకములలో నదియొక లోక మని వారు తలంతురు. అబిసీనియా యుద్ధమును దెచ్చిపెట్టిన కార్యకలాపముతో భారతదేశమునకు సంబంధ మేమియును లేదు. దాని ఫలితముతోను దానికి సంబంధము లేదు."

కమిషనువా రీవిషయమై అతనిని మరియొక ప్రశ్న వేయుగా నతడీ క్రింది యుత్తరువు నిచ్చెను:—

1600 ప్రశ్న: "మన అబిసీనియాదండయాత్రలలో నాస్ట్రేలియా కనడాలకున్న సంబంధముకంటె భారతదేశమున కెంతమాత్రమును హెచ్చు సంబంధము లేదు. యుద్ధమునకైన ఖర్చులకు సహాయము చేయవలెనని మనము ఆస్ట్రేలియా కనడాలను దండింపకపోవుట కున్న కారణ మొక్కటియే! మన మాసంగతిని తలపెట్టితిమా వారట్టి సూచనలను కాలితో తన్నుదురని మనకు బాగుగా దెలియును. వారు దాని నొక్క నిమిషమైనను ఆలింపరు వారట్లు చేతురా? నాకు యథార్థమైన భేదమేమియు గాన్పించుటలేదు అబిసీనియా యుద్ధమును దెచ్చిపెట్టుటకు గల కారణములతో భారతదేశమున కెట్టి సంబంధమును లేదు తత్ఫలితముతోను దాని కెట్టి సంబంధమును లేదు. అని నేను నిష్కపటహృదయముతో జెప్పక తప్పదు"

(ఈస్టు ఇండియా వ్యయములను గురించిన
పార్లమెంటరీ కమిటీ, 1876· Vol. III, పే. 151.)

వైస్రాయిగారి కౌన్సిలులో ఫైనాన్సుసభ్యులైన యస్. లైనుగారు 1860 లో ఫాసెటు కమిటీయెదుట సాక్ష్యమిచ్చుచు "భారతాదాయము లెట్లు తఱచుగా గుఱ్ఱపుదళముల కొఱకును ఇంగ్లండునకు కావలసిన యవసరములకొఱకును" బలివేయబడుచున్నవో యుదహరించుచు నిట్లుచెప్పెను.

"అబిసీనియా యుద్ధముకొఱకు భారతదేశముపై నేదియైనను రుద్దబడినచో నది మరియొక యుదాహరణముగ నేను చెప్పకతప్పదు"

(ఈస్టుఇండియా వ్యయములనుగుఱించి పార్లమెంటరీకమిటీ,
1875: Vol II, పే. 404. ప్రశ్న 7678.)

1897 ఫిబ్రవరి మాసములో వెల్బీకమిషను ముందు సాక్ష్యమిచ్చుచు నార్తుబ్రూకు ప్రభువు అబిసీనియను యుద్ధమునకైన సామాన్యఖర్చులు సుమారు 600,000 పౌనులు "భారతదేశము న్యాయధర్మముల ననుసరించి తిరిగి తీసికొనదగిన మొత్తము" అని నిరూపించెను. (భారతవ్యయ కమిషను, 1895 Vol. III, పేజి. 23 ప్రశ్న 14166.)

17. పిరాకుదండయాత్ర:— భారతదేశమునుండి సహాయార్థ మరువు తీసికొనివెళ్ళిన సైన్యముల సాధారణఖర్చుకైన 41,000 పౌనులు భారతదేశముపై రుద్దిరి. ఈ దండయాత్రకైన ఖర్చులో నే మాత్రమును భారతదేశముపై

వేయుట న్యాయముకా దనువిషయమై నార్తుబ్రూకు ప్రభువు వెల్బీకమిషను యెదుట నిట్లు సాక్ష్య మిచ్చెను:—

"అది చాల చిన్న మొత్తము. కాని యీపిరాకు విషయమై భారతదేశమునకు చాల దుర్ణయము కలిగింపబడెనను విషయమై సందేహించువా రుందు రని నే ననుకొనను. ఇది భారతసరిహద్దులను దాటి చేయబడినదండయాత్ర. దీనికి భారతాదాయము నేమాత్రమైన నుపయోగింపవలెనన్న పార్లమెంటుయొక్క రెండుసభలును చట్టముప్రకారము రాజుగారిని కోరవలెను. నే నప్పుడు గవర్నరుజనరలుగా నుంటిని ఈ ఖర్చులు భారతదేశముపై బడరాదని నేను ప్రతిఘటించియుంటిని. భారతప్రభుత్వమువారి మొరలను వినిపించుకొనలేదు సరికదా, రెండుసభలనుండియు జేయవలసిన దరఖాస్తులుకూడ చేయబడలేదు. ఈవిధముగా చట్టము ధ్వంసముచేయబడెను. ఇట్లు భారతప్రభుత్వముపై వేయబడినఖర్చుల నెన్నడును తిరిగి యిచ్చియుండలేదు. నాడుమొదలు నేటివరకు నది చట్టవిరుద్ధముగను, భారతప్రభుత్వప్రతిఘటనలకు విరుద్ధముగను భారతదేశముపై మోపబడెను. ఇది యీ పిరాకు యుదంతము. నేను చూచినవాటిలో నిదిరెండవ విషయము. ఇది యతిస్పష్టముగ నున్నదని యే నేను భావించెదను."

(భారతవ్యయ కమిషను, 1895: Vol III. పే. 20 ప॥ 14121)

18. రెండవ ఆఫ్ఘనుయుద్ధము:— ఈ యుద్ధమునకు 220 లక్షల పౌను లయ్యెను. ఇందులో నింగ్లండు 50 లక్షలు మాత్రమే యిచ్చెను. తక్కిన 170 లక్షలు భారతదేశముపై తోసివేసెను.

1872 కు కొంతకాలముపూర్వమునుండియు భారతప్రభుత్వము బ్రిటిషు ప్రభుత్వమువారి ప్రోత్సాహముమీద పశ్చిమోత్తర సరిహద్దులలో జబర్దస్తీనీతిని, బాటించుచుండి రను సంగతి చరిత్రప్రసిద్ధము. 1876 లో నార్తుబ్రూక్ ప్రభువు ఇట్టి నీతిని ప్రతిఘటించుచు తన వైస్రాయిపదవికి రాజీనామా నిచ్చెను. అతని తరువాత లిట్టనుప్రభువు వచ్చెను. అతని నీక్రిందినీతిని (అతనిమాటలలోనే) అనుసరించవలసినదని శాసించిరి.

"నేను భారతదేశము వచ్చితిని; కాని నేను భారత దేశము వచ్చుటకు ఇంగ్లండును వీడక పూర్వము భారత సెక్రిటరీయగు సెలిస్బరీప్రభువు నన్ను అనేకసార్లు కలిసి కొనెను. భారతసరిహద్దుసమస్య సామ్రాజ్యసమస్యనుండి విడ దీయరాని పిల్ల సమస్య యనియు, నాంగ్లప్రభుత్వముయొక్క సాధారణనీతిమీదనే ముఖ్యముగా దానినీతి యేర్పడుననియు ప్రత్యేకసందేహముతో నేను భారతదేశము వచ్చితిని"

(భారతవ్యయకమీషను, 1895. Vol. III పే. 467)

లిట్టనుప్రభు విచ్చుటకు వచ్చుటతోడనే యీయుద్ధ మారంభమయ్యెను. ఈ యుద్ధమునకైన ఖర్చులను గురించి పార్లమెంటులో జరిగినచర్చలో ఫాసెటు ఇట్లు చెప్పెను.

"స్వపరిపాలనము ననుభవించుచున్న కాలనీప్రభుత్వ ములయెడలను, స్వపరిపాలనము లేని భారతదేశముపట్లను మన మనుసరించుచున్ననీతి యేది? స్వపరిపాలనము నను

భవించుచున్న కేపుకాలనీలో మనము బాధ్యులముకాని యుద్ధమొకటి సంభవించెను. దానికైన ఖర్చును చెల్లింపవలసిన దెవరు? దానివలన నాంగ్లప్రజలపై 50 లక్షలు పడును. భారతదేశములో నాప్రజ లెంతమాత్రమును బాధ్యులుకాని యుద్ధమొకటి జరుపబడెను. యూరపులోని మనచర్యలవలనను, నీతివలనను ఈ యుద్ధము వచ్చెను. స్వపరిపాలనముగాని, ప్రాతినిధ్యముగాని లేనిభారతప్రజలనుండి మన మీయుద్ధమునకైన ఖర్చులలో ప్రతి ఆరుపెన్నీలు గుంజుకొంటిమి."

(భారతవ్యయ కమిషను, 1895: Vol. III, పే. 467)

గ్లాడ్‌స్టనుగారు ఫాసెటును సమర్థించుచు నిట్లుచెప్పెను:— "ఈ ఆఫ్ఘనుయుద్ధమునకు సామ్రాజ్యయుద్ధస్వభావము కలదని స్పష్టముగా గ్రహింపబడెను...... కేవల మంత చిన్నమొత్తముకాక (50 లక్షల పౌనులు) నా మిత్రుడైన (Exchequer) ఖజానా ఛాన్సెలరుగారు చెప్పినట్లు పెద్దమొత్తము, హెచ్చుమొత్తము నైనను ఈదేశము భరింపవలసియున్న దని నా యభిప్రాయము."

(భారతవ్యయ కమిషను, Vol III, పే. 467)

ఈ యుద్ధమునకు గలకారణములను, ఉద్దేశములను లక్ష్యమం దుంచుకొంటిమేని యీ యుద్ధమునకైన ఖర్చులలో గొంతయైనను భారతదేశ మేల యిచ్చుకొనవలెనో తెలియరాదు. ఇంతేకాదు. యుద్ధానంతర మాఫ్ఘను అమీరునకు

సంవత్సరమునకు 6 లక్షలచొప్పున నీయవలసిన మొత్తమును, 1894 లగాయితు 6 నుండి 12 లక్షలవరకు హెచ్చింపబడిన మొత్తమును భారతదేశముపై రుద్దిరి. ఇదంతయు మేరువంత యయ్యెను. కీర్తిశేషులైన గోఖలేగారిట్లు వచించిరి:—

"అమీరునకును, ఇతర కొండజాతినాయకులకును చెల్లించు వ్యయమంతయు మధ్యఆసీయాలో సామ్రాజ్య ప్రయోజనములను పెంపొందించునట్టి కేవలసామ్రాజ్య వ్యయము."

(భారతవ్యయములను గురించినకమిషను, 1895. Vol III, పే. 244. ప్రశ్న 18528)

19. 1882 లోని యీజిప్టు దండయాత్ర:—ఈ దండయాత్రతో చాలజోక్యము తనకు గలదని చెప్పుకొనిన నార్తుబ్రూక్‌ప్రభువు వెల్బీకమీషనుముందర సాక్ష్య మిచ్చుచు ఇంగ్లండు 500,000 మాత్రమే చందావలె చెల్లించుట కాక దీని కైనమొత్తము 1,700,000 పౌనుల ఖర్చులోను సగమైనను భరించవలెనని సూచించెను. ఆకాలములో నతడు ప్రభుత్వములోనుండి యీయుద్ధమున కైన దానిలో నేమాత్రమైనను భారతదేశము భరించుట యన్యాయమని చెప్పుట కతనికి గల కష్టము మన మెరుగనిది కాదు.

(భారతవ్యయకమిషను, 1895: Vol. III, పే. 20 ప్ర. 14124)

ఈ దండయాత్రలో భారతదేశమున కెంతమాత్రమును ప్రయోజనము లేదనియు, అది దీనికైనఖర్చులో నెంతమా

త్రమును భరింప నవసరము లేదనియు, మేము మనవిచేయుచు న్నాము. భారతప్రభుత్వమువారి మిలిటరీ శెక్రటరీ యయిన మేజరుజనరల్ ఇ హెచ్. హెచ్. కాలెన్ మాయభిప్రాయమునే సమర్థించుచున్నాడు. ఇట్టి దండయాత్రకు భారతదేశ మొక్క దమ్మిడీయైనను చెల్లింప నవసరము లేదని వెల్బీ కమిషనుముందర నతడు కంఠోక్తిగా చెప్పెను.

(భారతవ్యయ కమిషను, 1895: Vol I పే. 401. ప్ర. 6126)

20. పశ్చిమోత్తర సరిహద్దులలో జరుపబడిన చిన్న దండయాత్రలు పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రములను కలుపుకొనుటగా పరిణమించిన దండయాత్రలు. "బాహాటముగా సామ్రాజ్యప్రయోజనముల కొఱకే" యనుట నెవరును కాదనజాలరు. "పెద్దసామ్రాజ్యసమస్యలో నవిభాజ్యమగు భాగములైన యీయుద్ధము లన్నింటికిని సామ్రాజ్యధనాగారమే చెల్లించవలసియున్నది."

(భారతవ్యయ కమిషను Vol. IV, పే. 187. పేరా 98).

1882 ఏప్రిల్ లగాయితు 1891 మార్చివఱకు నీదండయాత్రలకు 130 లక్షల పౌనులు వెచ్చింపబడెను ఈ మొత్తములో యుద్ధభటుల కిచ్చుమామూలుజీతము చేరియుండలేదు.

(భారతవ్యయ కమిషను: 1895, Vol. I, పే. 222.
ప్రశ్న 5347-50)

**21.** బర్మాయుద్ధము, **1886:**— ఇది బర్మాయెడల జూపబడిన జబర్దస్తీ నీతివలన సంభవించెను. బర్మాను కలుపుకొనుటవలన గ్రేటు బ్రిటనుయొక్క రాజ్యము విస్తరించెను. దీనివలన రాజ్యాభివృద్ధి యగుట, వర్తకము హెచ్చుట, బర్మా ప్రకృతిసంపత్తు నంతయు కొల్లగొనుట, తన నిజైశ్వర్యము మెండగుట, మొదలగు లాభములు గ్రేటుబ్రిటనుకు చేకూరెను. భారతదేశమువిషయములో నివి యేమియు గాన్పించవు. ఈ యుద్ధమువలన తాను మాత్రమె లాభము పొందిన గ్రేటు బ్రిటను మాత్రమే దీనికైన 47 లక్షల పౌనులను భరించుట న్యాయము. ఇంతియేకాదు.

"బర్మాయొక్క మామూలు న్యాయపరిపాలన కగు ఖర్చుకూడ చాల సంవత్సరములవరకు భారతాదాయముపై తీరని భార మయ్యెను" (సి. యన్. వకీలు "ఆధునిక భారతదేశముయొక్క ఆయవ్యయాభివృద్ధి" పే. 130) తాను భరించిన యీ ఖర్చులను హిందూదేశము (బర్మా హిందూదేశమునుండి యొక వేళ విభజింపబడినను గూడ) తిరిగి పుచ్చుకొనుటకు హక్కు గలిగియున్నది. వెల్బీకమిషను ముందర సాక్ష్య మిచ్చుచుండి డి. ఇ. వాచాగారు ఈ విధముగా జెప్పిరి:—

"అప్పరు బర్మా దండయాత్రకైన ఖర్చుల నన్నింటిని, తరువాత దాని న్యాయపరిపాలనకైనఖర్చులను యింగ్లండు

భారతదేశమునకు పూర్తిగా నిచ్చివేయవలెను. తరువాత కాం గ్రెసువారు సూచించినట్లు ఆ రాష్ట్రమును భారతదేశమునుండి విడదీసి క్రౌనుకాలనీగా చేయవలెను. రంగూనుమాండలేల లోనున్న ఆంగ్లవర్తకుల ప్రోద్బలముచేతనే బర్మా ఆక్రమింప బడెను. భారతీయు లెన్నడును దీనిని కోరియుండలేదు. ఆంగ్ల పెట్టుబడిదారులప్రయోజనముల నభివృద్ధి చేయుటకును బ్రిటిషుసామ్రాజ్యమును పెంచుకొనుటకును భారతరెవిన్యూ నుండి ధనమును గుంజుకొనుట భారతదేశమున కక్రమ మని చెప్పకతప్పదు."

(భారత వ్యయకమిషను, Vol. III పే. 204. ప్ర. 17821)

కీర్తిశేషులైన గోఖలేగారు ఈకమిటీముందరనే సాక్ష్య మిచ్చుచు నిట్లుచెప్పెను :—

"అప్పరుబర్మా భారతసరిహద్దులను దాటియున్నది. దానిని జయించుటలోగాని కలుపుకొనుటలోగాని మన కెట్టి ప్రయోజనమును (సామ్రాజ్యములో నొకభాగముగా నుంచు కొని పాలింపవలెనను కోరికతప్ప) లేదు. సామ్రాజ్య నీతిని, సామ్రాజ్యముయొక్క వర్తకప్రయోజనములను పెంపొందిం చుటకే యీ దండయాత్ర గావింపబడెను. ఇచ్చట హిందూ దేశముయొక్క ప్రత్యేకప్రయోజనముల కెట్టి విపత్తును సంభ వింపలేదు."

(భారతవ్యయకమిషను, 1895 : Vol. III పే. 243)

22. సాకీం దండయాత్ర:— ఈ ఖర్చులను భారతదేశ ముపై వేసి రుద్దుటలో గల యన్యాయమునుగురించి మనకు

భారతప్రభుత్వమువారు చేసినప్రతిఘటనలు తప్ప వేరేమియు నవసరము లేదు.

సాకీమును బలపర్చుకొనుటకును, నైలుతీరమున వినియోగించుకొనుటకును ఈజిప్టుసైన్యములకు స్వేచ్ఛ కలుగజేయుటకును హిందూదేశములోని దేశీయసైనికపటాలమును తయారుచేయవలసినదిగా మన మాజ్ఞాపింపబడితిమి. పైని వర్ణింపబడిననీతి ననుసరించుటలో భారతప్రయోజనము లెంతదూరములోనైనను గాన్పింపవు. సూయజుకాలువయొక్క క్షేమము భంగ మగుచున్నదని మనము చెప్పజాలము. సాకీముకు పోవుచున్న సైనికుల సాధారణఖర్చులను భరించుచున్న భారతప్రజలు భారతదేశములో పనిచేయనట్టి సైన్యముల కేల పన్ను చెల్లింపవలెనో, యీజిప్టు సరిహద్దులో క్రమమును నిలుపుటకును, ఈజిప్టులోని యొకభాగమును తిరిగి జయించుటకును లేక యిటలీసైన్యములకు సాహాయ్యము చేయుటకును మేము చెల్లింపవలసినకారణము లేవియో గ్రహింపజాలము.

ఇట్టి పరిస్థితులలో, దేనిపరిపాలన మన హస్తగతము చేయబడెనో యట్టి దేశముయొక్క ప్రయోజనములను లక్ష్యమందుంచుకొని హిందూదేశమున కొంతమాత్రమును సంబంధములేని సేనలకైనఖర్చులను హిందూదేశముపై వేసిరుద్దునట్టినీతిని ఎంతతీవ్రముగా ఖండింపగలమో యంత తీవ్రముగా ఖండించుట మాధర్మ మని మేము భావించుచున్నాము. ఇది హిందూదేశమునకు జాల యక్రమము; ఏలయన నిది ఇంగ్లం

డు హిందూదేశమునకు సైన్యముల నప్పిచ్చినపు డొక నీతిని హిందూదేశ మిచ్చినపుడు వేరొకనీతిని పాటించుచున్నది. ఇది యనవసరము; అధర్మము. ఇది మనప్రభుత్వమును, ప్రభుత్వ నీతిని యపనిందలపాలుజేయుచున్నది."

(సి. యన్. వకీలుగారి "ఆధునిక భారతదేశము యొక్క ఆయవ్యయాభివృద్ధి", పే. 131)

23. ఐరోపాయుద్ధము : 1914—1919 నాటి మహా సంగ్రామమును తీసికొందము. యుద్ధ మారంభ మగుటతోడనే హిందూదేశమునుండి కోటానుకోట్ల సైన్యములు యూరపులోని వివిధకదనరంగములకు బంపబడెను. యుద్ధము సాగినకొలది నిది మరింత హెచ్చెను. ఈ యుద్ధములో బ్రిటీషుప్రభుత్వమునకు సైన్యసహాయమునే గాక కొంతవరకు ధనసహాయమును గూడ చేయవలె నని భారతప్రభుత్వమువారి యభిప్రాయమైన ట్లుండెను.

1914 సెప్టెంబరు 8 వ తేదీని ప్రభుత్వసభ్యులసంఖ్య యధికముగా నున్న సామ్రాజ్యశాసనసభలో నొక తీర్మానము వంటి నాటకము జరిపింపబడెను. ఆ తీర్మానము సర్ గంగాధరరావు చిట్నవీసుగారిపేర నుండెను. రాజసార్వభౌమునకు వినయభక్తిభావములు ప్రకటింపబడినతరువాత నది యిట్లుండెను.

"భారతదేశ మిపుడు సామ్రాజ్యమునకు సైన్యరూపకముగా జేయుచున్నసహాయమునుమాత్రమేగాక భారతప్రజ

లీయుద్ధమువలన నాంగ్లప్రభుత్వముపై బడు నమితధనవ్యయ ములో గొంత పంచుకొనగోరుచున్నారనియు, భారతప్రభు త్వమువారి యభిప్రాయమును మన్నించి సామ్రాజ్యముతో భారతదేశీయైక్యతను వెల్లడింపవలెననియు నీ సభవారు తమ యభిప్రాయమును బ్రకటింపగోరుచున్నారు."

ఈ తీర్మానము బహువిశాలముగ నున్నది. కాని యప్పటి వైస్రాయియైన హార్డింజిప్రభువు భారతదేశ ఆర్థిక దైన్యమును గ్రహించినవాడై దీనిని హిందూదేశమునుండి యింగ్లండునకు బంపబడినసైన్యముయొక్క సామాన్యఖర్చులకే నియమించెను. ఈ తీర్మానముమీది చర్చలను ముగించుచు నత డిట్లు చెప్పెను.

"కాని యీ విషయమునుగురించి మేము యోచించి యుంటిమి. ప్రస్తుతసంకటావస్థలో భారతదేశమునుండి యూ రపునకు బంపబడు భారతసైన్యముల కగుఖర్చుల నాంగ్లప్రభు త్వముపై వేసి తా మా ధనమును మిగుల్చుకొనవలె ననెడి యుద్దేశము భారతప్రజల కోరిక కనుగుణముగా నుండె దని మేము భావించితిమి; ఈ భావమునే యిపు డిచ్చట నుప పాదింపబడినతీర్మానమును ఒసంగబడిన యుపన్యాసము లును బూర్తిగా బలపరచుచున్నవి. ప్రభుత్వమువారి తర ఫున నే నీ తీర్మానము నంగీకరించుచున్నాను. దీని మరతులను భారతసెక్రిటరీగారికి తెలియపరచుటలో నే నెంతమాత్రము నాలసింపను. ఇది మేము చేయవలె నని భావించినసూచన కెంతయో బలము నిచ్చుచున్నది. ప్రస్తుత పరిస్థితులనుబట్టి

యూరపునకు బంపబడినసైన్యముల కవి యీదేశములోనే యున్నచో వాటి కగు మామూలు ఖర్చులనుమాత్రమే తీసి కొన సూచించెదము. ఇట్లు చూచినచో భారతప్రభుత్వము బ్రిటిషుప్రభుత్వమునకు (యుద్ధము ప్రస్తుత సంవత్సరాంతము వరకు సాగింపబడినయెడల) సుమారు 10 లక్షల పౌనుల నియ్యగలదు. ... ఇంతకంటె నెక్కువ యుదారతను జూపుట పన్ను చెల్లించు భారతప్రజలకు న్యాయము చేసినట్లు కాజాల దని మేము భావించెదము......"

(సామ్రాజ్య శాసనసభాచర్యలు: Vol. 53, పే 35-36)

ఈ విధముగా గ్రేటు బ్రిటనుకు అప్పు యిచ్చిన సైన్యమునకైన సామాన్యఖర్చులను భరించుటతో భారత దేశమును విడిచిపెట్టిరి. చట్టాధికారము (1921-22 యొక్క 55 వ సెక్షను Vic. 106 అధ్యాయము) క్రింద పార్లమెంటు యొక్క రెండుసభలయనుమతియు లేనిదే భారతప్రభు త్వమువా రిట్టిభారమును భారతదేశముపై వేయుట కధికా రము లేదు. కనుక 1914 నవంబరులో పార్లమెంటు భారత ప్రభుత్వమువారు తీసికొనిన చర్య నామోదించుచు తీర్మా నించిరి. ఆతీర్మాన మిట్లుండెను.

"ఈ దేశ మిపుడు గావించుచున్న యుద్ధములో బనిచేయు టకుగాను భారతదేశాదాయమునుండి పోషింపబడుచున్న సై న్యములను బంపునట్లు చక్రవర్తిగా రాజ్ఞాపించుటచే నీ సభవా రట్లు పంపబడినట్టి లేక యుద్ధము ముగియువరకును బంప బడు సైన్యమున కగు మామూలు జీతమును తదితరమామూలు

ఖర్చులును 'నీయుద్ధములో నుపయోగింపబడు భారతప్రభుత్వమువారి యోడల కగు మామూలుఖర్చులును (అవి భారతదేశములోను లేక సమీపసముద్రములలోను నుండుచో భారతదేశమే భరించునట్టి ఖర్చులు) భారతదేశమే భరించునుగాక! ఒకవేళ నట్లుపయోగింపబడు సైన్యములుగాని, యోడలుగాని తగ్గింపబడి క్రొత్తవాని నుపయోగించుట యవసరమైనచో నట్టి సైన్యములకును, నోడలకును నగు ఖర్చులు పార్లమెంటువారి యుద్ధములకొఱకు నిర్ణయించు నెట్టి ధనములోనుండి యైనను జెల్లింపబడును."

(ఆయవ్యయ వాజ్మూలము, 1917-18.)

ఈ తీర్మానమువలన పార్లమెంటు మరియొక అడుగు ముందునకు వేసి పై సైన్యముల కగు మామూలుఖర్చులనేగాక రాకపోకల కగుఖర్చులను గూడ భారతదేశముపై రుద్దెను. ఇది బారతదేశమునకు లెంపపెట్టు చెంపపెట్టువలె నున్నది. భారత సెక్రిటరీగారే యింతవరకుగల యాచారమును గురించి యిట్లు వ్రివ్రిరి.

"మనము యింగ్లండునుండి యెన్ని సైన్యములను భారతదేశమునకు బంపినను వాని కగుఖర్చుల నాంగ్లతీరములను విడుటతోడనే హిందూదేశముమీదనే వేయుచున్నారము. కాని విదేశములలో జరుగుయుద్ధములకు భారతదేశమును సాయముగోరినపుడు గూడ నట్టి సైన్యముల కగు మామూలు జీతబత్తెములను (అవి భారతదేశములో నౌకరీ చేయకపోయి

సను) భారతదేశ బొక్కసమునుండి తీసికొనుట సామాన్యాచారమై పోయినది.)"

(1872 ఆగష్టు 9వ తేదీని ఇండియా కార్యాలయమువారు యుద్ధకార్యాలయమువారికి వ్రాసిన యుత్తరము.)

అనగా భారతదేశము సైన్యములను బంపునపుడు రాకపోక ఖర్చులను భారతదేశము చెల్లించుటలేదు. ఈ యాచారమును వీడి, పై తీర్మానముప్రకారము పార్లమెంటు హిందూదేశమునుండి రాకపోకఖర్చులను గూడ గుంజుకొనెను.

24. "యుద్ధవిరాళములు"—1917–18 లో నీశాసనసభలో బడ్జటును ప్రవేశపెట్టుటకు బూర్వమే భారతప్రభుత్వమువారు భారతసెక్రిటరీగారితో సంభాషణములను జరుపుచునే యుండి భారతదేశమునుండి 1000 లక్షుల పౌనులను యుద్ధఖర్చులకు విరాళముగా తీసికొనుటకు నిశ్చయించిరి. సర్ విలియం మేయరుగారు, ఫైనాన్సుసభ్యుడు, 1917 మార్చిలో చేసిన బడ్జటువాఙ్మూలములో మొదటిసారి యీ యుద్ధవిరాళములనుగూర్చి శాసనసభకు నివేదించుచు నిట్లు చెప్పెను.

"తన నిజరాజకీయ ఆర్థికభవిష్యత్తు లతి గాఢముగా పెనగొనబడియున్న యీ యుద్ధమునకు భారతదేశము మరికొంత ప్రత్యక్షసహాయమును చేయువిషయమై మనపరిస్థితుల కవసరమగుచో అప్పుడీ సమస్యను చర్చించుకొనవచ్చునని మే మెప్పుడును భావించుచుంటిమి. ఈ యుద్ధకాలములో భారతదేశవర్తకమును క్షేమమును చక్రవర్తిగారి నావికా

దళమునకు సముద్రముమీఁద గల పలుకుబడిచే మంచిలాభ, స్థైర్యములను పొందెను. ఈ విషయమై మేము చక్రవర్తి ప్రభుత్వముతో నిరంతరము సంభాషించుచునే యుంటిమి. మన యాశ్రితమును సుగమముగా నేరవేర్చుకొనుటకును నీ సభలో గంగాధరరావు చిట్నవీసు తీర్మానము నుప పాదించినపు డేకగ్రీవముగా ప్రకటింపబడిన దేశభక్తి కీవిధ ముఁగా మరింత వన్నె దెచ్చుటకును సమయ మేతెంచెనని మే మభిప్రాయపడుచున్నాము. ...”

సర్ విలియం మేయరుగారు చెప్పినట్లు ఆ 1000 లక్షల పౌనులు “యుద్ధమునకుపూర్వము మన సామ్రాజ్యాదాయ మునకు రెట్టింపు” అగుచున్నది. ఆ సమయములో నా సభ లోని చర్చావిధానము భారతప్రభుత్వకార్యనిర్వాహకవర్గము వారి కృత్యమేకాని యైచ్ఛికముగా భారతప్రజ లొసంగి నది కాదని తేటపర్చగలవు. భారతప్రభుత్వము తనను నడిపించుచట్టముల యధికారముక్రింద తన యాదాయము నుండి గ్రేటు బ్రిటనుకు దానము చేయునధికార మెంతమాత్ర మును కలిగియుండలేదు.

1918 సెప్టెంబరు మాసములో ఫైనాన్సు సభ్యుడైన సర్ విలియం మేయరు యుద్ధమునకైన చిల్లరఖర్చులను తీర్చు టకుగాను 450 లక్షలపౌనులు కావలెనని శాసనసభలో తీర్మానము నుపపాదించెను. అందులో నొక తమాషా సూచన చేయబడెను. భారత సైన్యముయొక్క “నిజ సంఖ్య”

160,000. దీనిని 500,000 గా భావించి పార్లమెంటుసభలో నెక్కువఖర్చులకు తీర్మానమును దెచ్చి వానిని భారతదేశముపై వేయవలెనట! చాల చర్చ జరిగిన తరువాత కొన్ని మరతులు విధింపబడెను. తత్ఫలితముగా 260 లక్షల పౌనులు మాత్రిమే విధింపబడెను.

(సామ్రాజ్యశాసన సభాచర్యలు: Vol. 57. పే. 167-68)

25. ఇతర యుద్ధభారములు:—ఈ యుద్ధమువలన భారతదేశముపై మొత్త మెంతభారము పడెనో యోచింతము. ఇక్కడనుండి సరియైనలెక్కలు దొరకనిచోట ఉజ్జాయింపు లెక్క వేసికొనవచ్చును. కడచిన యుద్ధములో భారతదేశ మెన్నెన్నివిధముల జేతికి నెముక లేకుండ బ్రిటనుకు సహాయము చేసెనో, తత్సహాయమునకు బ్రిటను ప్రతిఫలముగా భారతదేశమున కేమి ప్రసాదించెనో మొదట గ్రహింపవలసి యున్నది. (1) సరిగా యుద్ధము ప్రారంభ మగుటతోడనే హిందూదేశము సుశిక్షితమైన కొంచె మించు మించు తనసైన్యమునంతను ఫ్రాన్సునకు బంపివేసెను. ఒకప్పుడు తన సరిహద్దులను గాచుకొనుటకును, దేశక్షేమమును గాపాడుటకును 30,000 కంటె నెక్కుడు సైనికులు లేనట్టి యుపదరివస్థితి—1857 తరువాత నెప్పుడు నిట్టిది సంభవింప లేదు—కూడ నేర్పడెను. ఈ యుపదరివస్థితియొక్క యాంతర్య మేదియో యెవ్వడును దరివ్య రూపమున లెక్కింప బ్రయత్నింపలేదు. (బహుశః అది యసంభవముగ నుండెను) ఫ్రాన్సునకు బంపబడిన సుశిక్షితులైన సైనికులకు బదులుసైనికులు వచ్చినను వా రందరు నెట్టి

శిక్షయు లేనట్టియు నాయుధాదిసామగ్రి లేనట్టియు, నను భవహీనులైనట్టియు తెల్లరాష్ట్రీయసైనికులు, సుశిక్షితులైన మనసైనికులతో యుద్ధపాటవములో వారీడు రాకపోయినను వారికి మనసైనికులకంటె రెండు మూడురెట్లు ధనవ్యయ మెక్కువ యయ్యెడిది. (2) ఇంతేకాక భారతదేశము ఆఫ్రికా యూరపు, ఆశియాలలోనున్న యనేక చిన్నచిన్న కదనరంగముల కనేకవేలసైనికులు గలసైన్యములను, చతుర్విధ యుద్ధసామగ్రితోను, యంత్రసామగ్రితోను ముస్తాబుచేసి పంపించెను. ప్రధానపశ్చిమముఖమున నున్న బ్రిటిషు సైనికుల కివి మంచి తరుణములో సాయపడెను. భారతదేశముపై బడిన యీభారమున ద్రవ్యరూపములో లెక్కింప శక్యమైనను నీ సహాయముయొక్క యథార్థమూల్యమును రూపాయిలు, అణాలలో లెక్కింప జూచుట వెఱ్ఱితనము. (3) ఇదంతయు చాలనట్లు పైన పేర్కొనబడినవిధమున హిందూదేశము చాల ద్రవ్యమునుగూడ (కొంత హిందూదేశములోనే ఋణము చేసి) దానముచేసెను. ఇది యాంగ్లభారతదేశములమధ్య నంతకంతకు పెరుగుచున్న మారకపుటొత్తిడిని (భారతదేశమున కపారనష్టము చేయుచు) తగ్గించెను; బ్రిటనుకైన యుద్ధఖర్చులలో గొంత తనపై వేసికొనెను. దీనిని ద్రవ్యరూపముగా లెక్కింపవచ్చును; అట్లు లెక్కింపబడెను. దీని విలువను గురించి వివాద మేమియు నుండజాలదు.

అయినను బ్రిటనుకు చేయబడిన యీదానము యొక్క ధనభార మీరోజున కేవలము కాగితముమీద లెక్కరూపక

ముగా జూపింపబడిన రూపాయలు, అణాలకంటె చాల హెచ్చు గా నుండెనని మేము భావించుటకు గలకారణములను గొన్నింటిని తెల్పెదము. ఈ యుద్ధముయొక్క ప్రత్యక్షఫలితముగా నీద్రవ్యదానము గాక భారతదేశముయొక్క "మామూలు" సైనిక, పరిపాలన ఖర్చులుగూడ చాలవరకు హెచ్చింపబడెను. దీని నంతను తదాదిగా భారతదేశము భరించుచునే యుండెను. ఇట్టి యత్యధికభారములు భారతఖజానాపై బడుటచే నైరోపాసంగ్రామానంతరము వరుసగా నయిదు వత్సరములు భారతదేశముయొక్క మామూలు కేంద్రబడ్జటులో నే లోపము వచ్చుచుండెను. తత్ఫలితముగా భారతఋణభారము గూడ నంతకంతకు హెచ్చయ్యెను. కనుక నిదియే యుద్ధమువలన మనకు సంప్రాప్తించినయార్జన యని చెప్పక తప్పదు. దీనిని గూడ ద్రవ్యరూపములోనికి సుగమముగా మార్చి చెప్పవచ్చును.

(4) యుద్ధసమయములో భారతదేశముయొక్క విదేశ వర్తకమును నిరోధించుటకు జేయబడిన రెగ్యులేషను పరంపరలు భారతదేశమున కప్రత్యక్షముగా తీరనినష్టమును కలిగించెను. ఈ నష్టమును ద్రవ్యరూపములో బెట్టుట యసాధ్యము. ఈ నిర్బంధములు భారతవిదేశవర్తకమును తుంచివేసెను. మారకమువలన దటస్థించిన చిక్కులచే తికమకలాడుచున్న కరెన్సీకొలదు భారతప్రభుత్వముపై గల యొత్తిడి దీనివలన తగ్గిపోయెను. యుద్ధము భారతదేశపు మొగుమతులకు తీవ్రమైన ప్రోత్సాహమును కలుగ జేసెను.

దీనిచే దిగుమతులు తగ్గి వర్తకము భారతదేశమునకు ప్రస న్నముగా దినదినాభివృద్ధి నొందజొచ్చెను. భారతప్రభుత్వ మువారు తమ నిధినుండి యాంగ్లప్రభుత్వమాతరపున వ్యయ ములను చెల్లించుచుండుటచే నిది మరింత హెచ్చయ్యెను. ఈ యన్ని కారణములవలనను రూపాయివిలువ హెచ్చయ్యె ను. రూపాయియొక్క పౌనువిలువ పెరిగినను 1898-99 లో జేసినవాగ్దానముప్రకారము ప్రభుత్వమువారు రూపాయికి 16 పెన్నీలచొప్పున నియ్యవలసివచ్చెను. కాని రూపాయి నాణెములను ముద్రించుట నష్టదాయకముగా నుండుటచే వారు తమ 1898 నాటి యేర్పాటులను తోసిరా జనిరి. రూపాయియొక్క మారకపువిలువ మంచి హెచ్చుగా నున్న పుడు (వర్తకము భారతదేశమున కతిప్రసన్నముగా నున్న పుడు) హిందూదేశముమీాద నున్న 2000 లక్షల పౌనుల ఋణమును వారు చులకనగా కొని రూపాయి ఋణముగా మార్చి యుండవలసిది. ఇ న్లింతరొూ యార్థికచిక్కును భారతప్రభుత్వమువారి చెలామణి (Currency) మారకపు (Exchange) నీతులపట్ల గల యపనిందను బాపుకొనియుండె డివారు. ఇంతేకాక ప్రజాసామాన్య మిప్పటికిని కోల్పోన నట్టియమితనష్టము, దండుగ, దేశమునకు కలుగకుండెడివి. ఇం దులకు బదులుగా భారతప్రభుత్వమువారు ఇంగ్లండునకు బంపిం చుటకు భారతదేశములో ఋణములను జేసి భారతదేశము యొక్క పౌనుఋణమునకు మరింతనూతనభారమును జేర్చిరి.

26 యుద్ధఖర్చులు :— 1919 జూలై మాసములో ముఖ్యసేనాపతి పంపిన లెక్కలలో భారతదేశ మెంతమంది మనుష్యులను సమర్పించెనో చూపు అంకెలు గలవు.

"యుద్ధ మారంభ మగుసరికి సమరసన్నాహముతో నున్న భారతసైనికుల సంఖ్య (రిజర్వు సైన్యముతో సహా) 194,000 భారతీయులు యుద్ధకాలములో నానా బాపతు సేవలకును జేర్పబడినవారు 791,000; మొత్తము 985,000. ఇందులో 552,000 సముద్రములను దాటిరి. యుద్ధసన్నాహములు లేనివారసంఖ్య యుద్ధమునకు పూర్వము 45, 000. యుద్ధకాలములో 427,000 ఎక్కువగా జేర్పబడిరి 397,000 విదేశములకు పంపబడిరి కనుక మొత్తము హిందూదేశము 1,457,000 మందిని సమర్పించెను. ఇందులో 953,000 విదేశములలో బనిచేసిరి ఇందులో 106,594 మంది చనిపోయిరి. విదేశములకు బంపబడినజంతువుల సంఖ్య 175,000." ఈసహాయమునంతను ద్రవ్యములో ఖరీదుకట్టి చెప్పుట యసంభవము. కాని 1914-15 మొదలు 1921-22 వరకుగల యెనిమిదివత్సరములలోను భారతదేశము రక్షణకు వెచ్చించిన మొత్తములను జూచుట లాభదాయకము.

| సంవత్సరములు | కోట్ల రూపాయిలు. |
|---|---|
| 1914-15 | 30.80 |
| 1915-16 | 33.39 |
| 1916-17 | 37.48 |
| 1917-18 | 43.56 |

| సంవత్సరములు. | కోట్ల రూపాయిలు |
|---|---|
| 1918-19 | 66.72 |
| 1919-20 | 86.97 |
| 1920-21 | 87.38 |
| 1921-22 | 69.81 |

కేవలము హిందూదేశరక్షణ కగు మామూలు సైనిక ఖర్చు మాత్రమే తీసికొంటిమేని 1914-15 లో 30.80 కోట్లయ్యెను. ఈ ప్రకారము యుద్ధము జరిగిన 5 వత్సరములలో నగు మామూలు ఖర్చుకంటె 114 కోట్లు ఎక్కువ ఖర్చు పెట్టబడెను. ఇది యధికముగా భారతదేశముపై బడిన భారము. యుద్ధ మయినతరువాత గూడ రెండు వత్సరముల వరకు నీ హెచ్చుఖర్చు తప్పలేదు. రక్షణకొఱ కీరెండు వత్సరములలోను మామూలుకంటె 95.59 కోట్లు ఎక్కువ యయ్యెను. అనగా మొత్తముమీద 209 కోట్లు యుద్ధమునకు పూర్వప్రమాణముకంటె నెక్కుడుఖర్చు చేయబడెను. తరువాత నీరక్షణ (Defence expenses) కగు ఖర్చు తగ్గింపబడెను. కాని యదికూడ 1914-15 నాటి ఖర్చునకు రెట్టింపుండెను. మేము తిరిగి ముదరా రావలెనని కోరుమొత్తములో దీనిని కలుపనేలేదు. ఈ యంకె లన్నియు నైరోపాయుద్ధమువలన భారతదేశ మధికముగా ననుభవింపవలసివచ్చిన భారమును గొంతవరకు దెలుపుచున్నవి. చివర కిది భారతదేశరక్షణ కగు మామూలు ఖర్చుగా బరిణమించెను. హిందూదేశ మీసంగ్రామములో నీవిధముగా నింగ్లండునకు చేసినసహాయము మన

దృష్టి నాకర్షింపకనే పోయెను. 1914-15 మొదలు 1918.19 లోగా మొత్తము ఖర్చులు 870 లక్షలపౌనులనుండి 1061.4 లక్షల పౌనులవరకు బెరిగెను. ఐరోపాయుద్ధమువలన హిందూదేశముపై 1915-16 లగాయతు 1920-21 వరకు పడిన యదనపు సైనికఖర్చులు (355.50-184.80) 170.7 కోట్ల రూపాయిలను భారతదేశముపై నెన్నడును మోపరాదు. దానిని ఇంగ్లండు హిందూదేశమునకు తిరిగి యిచ్చివేయవలెను. ఈహక్కును గుర్తించుటలో ధర వరలలోని హెచ్చుదలనుకూడ మనస్సునం దుంచుకొనవలసియుండును.*

---

* పై మొత్తములనే గాక హిందూదేశము, బ్రిటిషుప్రభుత్వముకొఱకు 1914-15 మొదలు 1918-19 వఱకు గొంచె మించు మించు 2400 లక్షల పౌనులు ఖర్చును, యుద్ధమునకును, మెసపొటోమియా మొదలగు నిరంతర రంగములలో దత్సంబంధమైన ఖర్చులకును జెల్లించియుండెను వివిధ బడ్జెటులలోని యీక్రింది అంకెలను చూడుడు

| సంవత్సరములు | లక్షలపౌనులు |
|---|---|
| 1915-16 | 186 |
| 1916-17 | 385 |
| 1917-18 | 650 |
| 1918-19 | 998.3 |
| 1919-20 | 423.1 |
| మొత్తము | 2642.4 |

ఈ మొత్తము చాలవరకు బ్రిటనునుండి రాబట్టబడెను. కాని ఈవిధముగా బ్రిటనుకు చేయబడిన సేవ వడ్డీలేని ఋణము అపారము. భారతప్రభుత్వధనము 930 లక్షల పౌను లొకసారి బ్రిటిషుప్రభుత్వ సెక్యూరిటీః లో నుంచబడెను. ఈ మొత్తము 1920లో (మారకము భారతదేశమునకు నష్టదాయకముగా నున్నపుడు) భారతదేశమునకు మార్చబడెను. ఈ కాలములో (ఇంగ్లండులో చేయబడుఖర్చులను తీసివేసినను) భారతదేశముయొక్క నికరపునిలువ 381 కోట్లుండెను దీనితో భారతదేశము విదేశీయుల కీయవలసినఋణపత్రములను కొనినచో నవి తీరిపోయెడివి. అట్లుచేయక వాగ్దానము చేయబడిన యుద్ధదానముల నిచ్చుటకు ఋణములను జేసి క్రొత్తభారములను నెత్తిపై మోపిరి.

27. డొమినియనుప్రభుత్వములతో పోలిక:—విచారణలోని యీ భాగమును ముగించుటకుపూర్వము ఈసందర్భములో రెండు ముఖ్యవిషయములను గమనింపవలసియున్నది. బ్రిటిషుసామ్రాజ్యముక్రింద నున్న యితరడొమినియను ప్రభుత్వములతో పోల్చిచూచినచో హిందూదేశముయొక్క సహాయమును, తత్ఫలితముగా హిందూదేశము పొందినలాభమును నిట్టూర్పునకు కారణమగుచుండును. యుద్ధమారంభమైనపు డితరడొమినియనులు తమ స్వంతసరిహద్దులను రక్షించుకొనుటకు లేక తమ హద్దులలో నున్న సముద్రవర్తకమును కాపాడుకొనుటకు మాత్రమే వాగ్దానముచేసెను. భారతదేశమొక్కటే తన రాష్ట్రమును కాపాడుకొనుటే కాక ఐరోపా

యుద్ధములో పోరుటకు సామ్రాజ్య సేనల సహాయార్థము లక్షల కొలది సైనికులను బంపెను దక్షిణాఫ్రికాలో జర్మనుల ప్రయోజనము లుండుటచే నారాష్ట్రమునకు గొంత యుపద్రవము వాటిల్లుట కవకాశ ముండెను. కనుక ఆ సరిహద్దులను కాపాడుటవలన గొంత ప్రయోజనము కలదు. కాని ఆస్ట్రేలియా గ్యాలిఫరీ రంగమునకును, సముద్రరక్షణమునకును బంపిన సైన్యము భారతసహాయముమందర దిగగుడుపునకైనను బనికి రాదు. ఈ యుద్ధములో చేకూరిన విజయఫలితముగా హిందూదేశమున కావంతయు నిదమిత్థ మనులాభము చేకూర లేదు. కాని డొమినియనులు గ్రేటుబ్రిటనుతో పాటు జర్మనినుండి యింతవరకు తీసికొనబడిన యుద్ధపరిహారములో కొంత పంచుకొనెను. కాని యీ పంపకములో గూడ తన సహాయమునకును, తా ననుభవించిన బాధలకును తగిన లాభము హిందూదేశమున కేమియు లభింపదయ్యెను. ఈయుద్ధ పరిహారపంపకములో హిందూదేశమునకు జోక్య మేమియు లేదు. ఇంతకంటె ముఖ్యమైన రెండవ యంశ మీయుద్ధము వలన నీదేశముపైబడిన యథార్థభారము. దీనిని శోధింప వలసియున్నది. యుద్ధముకొఱకు చేసిన ఋణమునకు కొంత వడ్డీ చెల్లింపవలసియున్న దను సంగతిని తెలిచు మఱచిపోవు చుందుము. ఈ వడ్డీయొక్క నిజమైనవిలువ ద్రవ్యరూపకమున కంటె వస్తురూపమున పైకి కాన్పించుదానికంటె నెంతయో యధిక మని గ్రహింపవలెను. యుద్ధకాలములో, ధరవరలు 250 వ స్థాయిలో నున్నపుడున్న నూటికి 6 వడ్డీరేటు నేడు

వస్తురూపమైన విలువకు ద్విగుణ మయ్యెను. భారతప్రభుత్వ మువారి యాదాయవ్యయములను పురస్కరించుకొని మారకములో చేయబడునట్టి కృత్రిమమార్పులవలన కలుగునష్ట మిందులో చేరలేదు. ఈ ఋణముల కగువడ్డీకిని, ముంపుడు నిధికిని (నూటికింతయను నిర్ణయ మున్నను) పన్ను చెల్లించు భారతీయు డిచ్చు మొత్తము ద్రవ్యమునకు ప్రత్యామ్నాయముగా భారతకృషీవలు డిచ్చువస్తురూపములో జాల హెచ్చయ్యెను. ఋణదాతల కిచ్చునది 6 పౌనులేయైనను ప్రతి 100 పౌనుల ఋణమునకు దానీయవలసిన 6 పౌనులకు 1919లో భారతకృషీవలు డిచ్చువస్తుసామగ్రికి రెండుమూడురెట్లు తనపంటనుండి యిచ్చుకొనవలసివచ్చుచున్నది. ఋణగ్రస్తములైన ప్రతి దేశమునకు యుద్ధమువలన సంభవించిన (తీర్చివేయబడని) ఋణ భారమునుగురించి యాక్షేపణలు వచ్చెను. ఈ భారమును తరించుటకు చాలమంది ధైర్యమైన పద్ధతుల నవలంబించిరి. బ్రిటనుదేశము తన ప్రధానఋణదాత నడిగి యుద్ధఋణములో జాల సదుపాయమును బొందెను; తన ఋణస్థులపట్ల గూడ చాల నుదారతను జూపెను. బ్రిటనునకు బ్రాణముమీదకు వచ్చినపుడు హిందూదేశము గావించినసేవను, యుద్ధవిరాళములను గురించిన భారతహక్కులను ఆదరణతో జూడవలసి యున్నది. ఇతరు లిట్టిఋణవిముక్తిని పొందిరి, లేదా చేసికొనిరి, అనుకారణముచేనైన నేమి ప్రాణావసరమును గడపిరను కృతజ్ఞతచే నైననేమి భారతదేశమున కీబాధ తొలగి పోవలెను.

28. బడ్జటులో లోపములు:—1858 లగాయతు మామూలు బడ్జటులలో గలుగులోపములవలన చేయబడిన ఋణమును గురించి యిపుడు యోజింపవలసియున్నది. బడ్జటులలోని యీ లోపము లన్నియు గొంచెమించుమించుయుద్ధమువలనను లేక యుద్ధమువంటి కార్యములవలనను, మారకములో గలిగిననష్టమువలనను, కఱవు కాటకముల నివారణమువలనను లేక ఆర్థిక యసమర్థతవలనను గలిగెను. వీనిలో యుద్ధమువలనను అట్టి కార్యములవలనను గలిగినఫలిత మిదివరకే చర్చింపబడెను. కనుక పునరుక్తి యనవసరము. కాని మన మిపుడు చర్చించుచున్న మామూలుబడ్జటులోపము యుద్ధసంవత్సరములలో నప్పుగొనబడినద్రవ్యమునుండి చెల్లింపబడని యుద్ధ ఖర్చులను మాత్రమే తెలుపు నని గ్రహింపవలెను. యుద్ధము తరువాత వచ్చినసంవత్సరములలో నంతకంత కభివృద్ధిచెందు పెద్దపెద్ద బడ్జటులోపములు కలిగెను.

కేంద్రభారత బడ్జటులోని లోపములు.

| సంవత్సరములు | కోట్లు |
|---|---|
| 1918-19 | 5.73 |
| 1919-20 | 23.65 |
| 1920-21 | 26.00 |
| 1921-22 | 27.65 |
| 1922-23 | 15.01 |
| కోట్ల రూపాయిలు | 98.04 |

రాష్ట్రములలో వచ్చినబడ్జటులోపము లిందు జేర్పబడ లేదు. ఇవికూడ సంస్కరణానంతరము మూడువత్సరములలో చాల హెచ్చుగా నుండెను. భారతప్రభుత్వము కంపెనీచేతులలోనుండి బ్రిటిషుప్రభుత్వహస్తగతమైన తేదీ 1858-59 మొదలు 1929-30 వరకు గల కాలమును తీసికొందుమేని మొదటి 40 వత్సరములలోను 3,025,000 పౌనులు లోపము వచ్చెను. అనగా 5 కోట్ల రూపాయిలు. తరువాత 15 వత్సరములలో 54 కోట్ల రూపాయిలు నికరము మిగిలెను. యుద్ధకాలము 4 వత్సరములలోను 18 కోట్లు నామకః మిగులు కాన్పించును. యుద్ధము ముగిసినతరువాత 5 వత్సరములలో 98 కోట్లు నికరలోపము వచ్చెను. తరువాత నైదువత్సరములు కృత్రిమమిగులు (రూపాయి యొక్క మారకపు విలువను పెంచుటచే నేర్పడినది) చూపబడెను. చివర రెండుమూడు వత్సరములలో నంతకంతకు పెరుగుచుండినలోపము కలిగెను. ఒక్క 1929-30 లోనే మొత్తము 18 కోట్లు లోపము వచ్చెను. మొత్తముమీద బడ్జటులోపములు 121 కోట్లు. 1920 లగాయతు రాష్ట్రబడ్జట్లు విడతీయబడెను. కనుక నాలోప మిందులో జేర్పబడలేదు. మొత్తముమీద మిగులు 88 కోట్లు. కనుక మొత్తము నికరమైనలోపము 33కోట్లు. ఇదంతయు క్రొత్తఋణమునకు గారణమయ్యెను. యుద్ధములకు, కఱవులకు లేక మారకపు చిక్కులకు తటస్థించినఋణము ప్రత్యేకముగా లెక్కింపబడెను. కనుక నీ మొత్తము కేవలము ఆర్థికయసమర్థతకు

లేక సరిగా వ్యవహరింపజాలకపోవుటకు గాను భారతదేశము చెల్లించుకొనవలసిన సుంకము....

29 చిల్లరఖర్చులు:—ఏవిధమైన ప్రతిఫలము పొందకుండ చేయబడినఖర్చులలో భారతదేశము వెలుపల యిండియా కార్యాలయము, ఏడెను పరిపాల్యవ్యవహారములు, చీనా రాయబారశాఖ మొదలగు శాఖలకును, చిల్లర పద్దు బిల్లములకును గావింపబడిన ఖర్చులను యోచింప వలసియున్నది.

ఇండియా కార్యాలయము:—వెల్బీ కమిషను రిపోర్టు ప్రకారము యిండియాకార్యాలయమునకైన ఖర్చులు 1897-98 లో 240,000 పౌను లయ్యెను. 1900 వరకు దీనికైన యావత్తు ఖర్చు హిందూదేశమే భరించెను. ఈ ఖర్చు కొక నిలకడలేదు కాలనీ ప్రభుత్వములు కాలనీ కార్యాలయముల (యింగ్లియా కార్యాలయమువంటివే) కొక్కపైసయైనను నియ్యవు. "భారతదేశము సామ్రాజ్యములోని తదితర భాగములకంటె తక్కువ దాక్షిణ్యముతో చూడబడుచున్నదను నిందకు కారణము లేకుండుటకు" వెల్బీకమిషను వారు యిండియా కార్యాలయ ఖర్చులకు సంవత్సరమునకు 50 వేల పౌనులు విరాళమును శిఫార్సుచేసిరి. కాలనీలకును హిందూదేశమునకును మధ్య నిట్టిభేదభావము "చిరకాలాచారము చేతను, సాంప్రదాయము చేతను శాంక్షనుచేయబడెను." అని వెల్బీకమిషను కండ్లు తుడుచుచున్నది. ఎట్టి సాంప్రదాయముగాని, యెంతటి పురాణాచారముగాని యన్యాయము, నధర్మము నగుభారమును సమర్థింపజాలదు. ప్రతివత్సరము తన

కధర్మముగా నదనముగా కట్టబడుచున్న మొత్తమును నేడు హిందూదేశము వాఘసుకోరుచో న్యాయముగా, సరళముగా తనకు రావలసినదానిని తప్ప అది మరేమియు కోరుటలేదు.

౫౦. ఏడెను — ఈస్టుఇండియా కంపెనీవారు ఏడెనును 1838 లో సంపాదించిరి. తదాది 1895 నాటి భారత వ్యయకమిషనువారు 1900 సంవత్సరములో చేసిన రిపోర్టువరకు ఏడెనుకు న్యాయ, సైనికశాఖల కగు అన్నివిధముల ఖర్చులను హిందూదేశమే భరించెను. 1894-95 లో 206,000 రూపాయిలు సైనికవ్యయమున కయినట్లు భారతప్రభుత్వము లెక్క వేసెను. న్యాయశాఖకు, కట్టడములు, కాలువలు మొదలగు పనులకు సహా, 52,000 రూపాయిలు, ఆదాయము 23,000 రూపాయలు, లోటు 29,000 రూపాయిలు.

(భారతవ్యయ కమిషను నివేదిక Vol. IV పే. 92)

భారతవ్యయకమిషనువారు సైనికవ్యయములో సగము గ్రేటుబ్రిటను భరింపవలెనని శిఫార్సుచేయుచు దమ నివేదికలో నిట్లు వ్రాసిరి.

"సామ్రాజ్యము సమగ్రముగా నేర్పడినచో ఏడెనున కగు ఖర్చులను సామ్రాజ్యములోని సభ్యరాష్ట్రములన్నియు భరించును. అట్టి యేర్పాటు లేకపోవుటచే మరియొక యేర్పాటు జరుగవలెను. బ్రిటిషు ప్రభుత్వమువారు సైనికవ్యయములో సగము భరించినచో, బహుశః న్యాయమునకు దరిజేరినట్లుండును. హిందూదేశము సైనికఖర్చులో సగముమాత్రి

మెట్టినన్యాయమును బట్టి చెల్లింపవలయునో గ్రాహ్యము గాకున్నది. సామ్రాజ్యములోని సభ్యరాష్ట్రము లెవ్వియు నీ ఖర్చులో నొక్క పైసయైనను బంచుకొనలేదు. ఏడెనుకు సామ్రాజ్యమున కంతకును జెందిన ప్రాముఖ్యత గలదు. దాని నాక్రమించుట గ్రేటుబ్రిటను ఇండియాలమధ్య వర్తకమునకే గాక దానికిని ఆస్ట్రిలేషియాలోనున్న కాలనీలకును సంబంధించిన విషయము. గ్రేటుబ్రిటనుకు ఏడెనువలన గల ప్రాముఖ్యతను మేజరు జనరల్ ఇ. హెచ్. హెచ్. కాలెనుగారిభాషలోనే వర్ణింపవలెను. వెల్బీకమిషను ముందర 1896 మార్చిలో సాక్ష్యమిచ్చుచు నత డిట్లు చెప్పెను.

"ఏడెను ఇండియాకే గాక ఆస్ట్రేలియా, చీనాల కొకగొప్ప వర్తకత్రోవలోని నాభిస్థానమువంటిది. దాని యాక్రమణ హిందూదేశమునకే గాక గ్రేటు బ్రిటనుకుగూడ చాల యవసరము. వర్తకబోర్డువారి లెక్కలు నాదగ్గర కొన్నిగలవు. 1894 లో గ్రేటు బ్రిటననకును ఇండియాకును మధ్య, 67,553,348 పౌనులు విలువగల వర్తకము జరిగెను; గ్రేటుబ్రిటనుకును ఆసియాలోని యితరదేశములకును మధ్య 42,868,618 పౌనులును, గ్రేటుబ్రిటనుకును ఆస్ట్రిలేషియాకును మధ్య 54,824,476 పౌనులును విలువగల వర్తకము జరిగెను. కనుక వెనుకటిరెండును కలిసి మొదటిదానిని మించెను. ఆఫ్రికా తూర్పుతీరమునకును గ్రేటుబ్రిటనుకునుగలవర్తకమతిస్వల్పము. 1894 లో సూయజు కాలువద్వారా ఇండియా గ్రేటుబ్రిటనులమధ్య 2,442,252 టన్నుల వ్యాపారము జరిగెను. గ్రేటు

బ్రిటనునకును ఆశియాలోని యితరదేశములకును మధ్య 1,407,565 టన్నులును, గ్రేటుబ్రిటను ఆస్ట్రేలియా, న్యూజిలండుల మధ్య 993,991 టన్నులును, వ్యాపారము జరిగెను."

(భారతవ్యయ కమిషను 1895 Vol. I. పే. 415)

1897 ఫిబ్రవరిలో స్టెఫెను జాకబు, సి. యస్. ఐ., వెల్బీకమిషను ముందర నిట్లుచెప్పెను.

"ఈఖర్చులో ఇంగ్లండు కొంత పంచుకొనవలెనని భారతదేశము కోరుటకుగల కారణము లేవియన ఏడెనును తన క్రింద నుంచుకొనుటలో ఇంగ్లండున కనేకవిధములైన ప్రయోజనములు గలవు. వర్తకలాభములను గురించి యీ కమిషను ముందు విస్తరించి చెప్పబడెను. కనుక దానినిగురించి యింకంటె చెప్పవలసినది మరేదియు లేదు. వర్తకావసరములు (ముఖ్యముగా సూయజు కాలువ తెరువబడిన తరువాత) వర్తకజాతియైన యింగ్లండునకు ఏడెను వలన చాల లాభములను చేకూర్చుచున్నవి. ఏడెను ప్రాచ్యదేశముల వర్తక రహదారికి బీగమని చెప్పుట యెంతయు నొప్పుచున్నది. దీని సంరక్షణయందు వర్తకప్రపంచ మంతకును ప్రయోజనము కల దని చెప్పుటలో నతిశయోక్తి యెంతమాత్రమును లేదు. అన్నిటికంటె ప్రపంచములో ప్రధానవర్తకజాతియైన ఇంగ్లండున కెక్కువ ప్రయోజనము కలదు. ఇంతేకాదు. వావికా ప్రయోజనమునుబట్టి తద్వారా సైనిక ప్రయోజనమునుబట్టి చూచినను ఏడెనువలన నింగ్లండు కంతప్రయోజనము చేకూరు

చున్నది. యుద్ధసమయములో నది మననావికాసైన్యమునకు సామ్రాజ్యరహదారిలోని ముఖ్యమార్గములో బొగ్గుకోటవలెను, తిరిగి యమర్చుకొనుటకు వీలగు స్థానమువలెను బనిచేయును. ఈవిధముగా ప్రాచ్యదేశములతోడి గాకపోకలను రక్షించుకొనుట కది నావికాస్థానముగా బనిచేయును. ఏడెనుయొక్క నావికాదళమును, కోటలు వగైరాలను నిర్మించుటలో గొంత ఖర్చును యింగ్లండు భరించుటచే నీ సందర్భములో దనకుగల ప్రయోజనమును గొంత వెల్లడించెను. ఇట్టికోటను రక్షించుకొనుటలోగూడ నింగ్లండుకు సమాన ప్రయోజన మున్నదని చెప్పకతప్పదు. తరువాత రాజకీయముగా నాలోచించితిమేని ఏడెనుకుగల ప్రాముఖ్యతలో జాలభాగము (భారత ప్రయోజనములవలనగాక) సామ్రాజ్యముయొక్క సామాన్య విదేశ నీతివలననే యేర్పడుచున్నది."

(భారతవ్యయ కమిషను 1895 Vol. III. పే. 74-75)

పై యంకెలు భారతదేశములో జరుగు వర్తకము కంటె ప్రాచ్య దేశముతోను, ఆస్ట్రేలియాతోను జరగు వర్తకము 300 లక్షల పౌను లధికమని చూపుచున్నవి.

జిబ్రాల్టరు, మాల్టా అను మరిరెండు స్థానములు గ్రేటుబ్రిటనుయొక్క వర్తక ప్రయోజనములను రక్షించుచున్నవి. ఈ రెంటిని గ్రేటుబ్రిటనే తన స్వంతఖర్చులతో రక్షించుకొనుచుండ, ఏడెను కగు ఖర్చునంతను భారత దేశముపై విధించుటకు గారణముగాని, న్యాయధర్మములుగాని కాన్పిం

చవు. గ్రేటుబ్రిటను ఏడెను నాక్రమించినది లగాయితు నేటివరకును భారతదేశము దానికొరకు వెచ్చించిన ఖర్చు వంతను గ్రేటుబ్రిటనే భరింపవలెనని మేము మనవిచేయు చున్నాము. ప్రస్తుతము మావద్దనున్న కాగితములనుబట్టి భారతదేశ మీవిషయములో మొత్తమెంత చెల్లించెనో చెప్ప జాలము. కాని ముందు దానిని నిశ్చయించుట కెట్టికష్టమును లేదని మేము నిస్సందేహముగా చెప్పగలము.

31. పరిష్యామిషను:— ఇది 1810 లో స్థాపింపబడి 1823 వరకును గ్రేటుబ్రిటను ఖర్చులమీదనే పోషింపబడెను. 1823 లగాయితు 1831 వరకు నిది పూర్తిగా భారతద్రవ్యమునుండియే పోషింపబడెను. 1835 లో దీనిని తిరిగి బ్రిటిషు విదేశకార్యాలయమునకు మార్చిరి. కాని 1835 లగాయితు 1859 వరకును దీని ఖర్చులకుగాను సంవత్సరమునకు 12,000 పౌనులచొప్పున భారతదేశమునుండి చావగొట్టి వసూలు చేసిరి. 1859 లో నొక సంవత్సరముపాటు మరల దీనిని భారతదేశమునకు మార్చి గ్రేటుబ్రిటను ఆసంవత్సరమునకైన 15,000 కు 3,000 పౌనులుమాత్రమే యిచ్చెను.

1860 లో దీనిని మరల బ్రిటిషు విదేశకార్యాలయము వారు తీసికొనిరి. భారతదేశము 1860 లగాయితు 1880వరకు దీని ఖర్చులకు సాలీనా 12000 పౌనులు చెల్లించెను. 1880 లగాయితు 1890 వరకు నీ ఖర్చు 10,000 పౌనులకు తగ్గింపబడెను. తరువాత నిది 7000 పౌనులు చేయబడెను.

(భారతవ్యయ కమిషను 1895 Vol. IV, పే. 92, పేరా 242).

1899 లో వెల్బీకమిషనువారు భారతదేశముపై నీ ఖర్చు తగ్గింపవలెనని శిఫార్సుచేసిరి. అది యట్లు తగ్గింపబడి 1905 లో పూర్తిగా తీసివేయబడెను. (ఆధునిక భారతదేశము లోని ఆర్థికాభివృద్ధి.— సి. యన్. వకీలు. పే. 316)

ఈ పర్షియామిషను ప్రారంభమైనది లగాయితు హిందూ దేశము దీనికొఱకు చెల్లించిన మొత్తమునంతను గ్రేటు బ్రిటను హిందూదేశమునకు తిరిగియిచ్చివేయవలెనని మేము మనవిచేయుచున్నాము అట్టి భారమును హిందూదేశముపై వేయుటకుగల సరియైన కారణ మెవ్వరికి గాన్పించదు వీనిని కాపాడుట కేవలము సామ్రాజ్యసమస్య. భారతదేశమునకు పర్షియాలోనున్న ప్రయోజనమునకుగాను పై జుల్మానా విధించినట్లు కాన్పించును. గ్రేటు బ్రిటనకుగాని, సామ్రాజ్యము లోని తదితర కాలనీలకుగాని లేనట్టి ప్రత్యేక ప్రయోజనము భారతదేశమున కెద్ది కలదో యెచ్చటను విశదముగా జెప్పబడలేదు. దీనినిగురించియు భారతదేశముపై రుద్దబడిన యిట్టి యితరఖర్చులను గురించియు, వెల్బీకమిషను యిట్లు వ్రాసెను.

“అరేబియా మొదలు చీనావరకునుగల దేశములలో పరిపాలనకును, రాజనీతికిని సంబంధించిన ఖర్చు లుదయించు చునే యున్నవి. వీటికి సంబంధించిన రాజనీతిలో భారతదేశ మునకు ప్రయోజన మున్నదనుటలో నెట్టి సందేహమును లేదు.

కాని యీదేశములకు సంబంధించిన వివిధసేవలకగు ఖర్చు లలో భారతదేశముపై రుద్దబడిన విరాళములకును మన యితరకాలనీలు, ఆశ్రితరాష్ట్రములు మనకిచ్చు విరాళములకును నెట్టి పోలికయు లేదు. అమెరికా సంయుక్తరాష్ట్రములతో మనకుగల రాజనీతిసంబంధములలో కనడాకుగల ప్రయోజన మింతింతయని చెప్పజాలము. సంయుక్తరాష్ట్రములకును మన కును మధ్య తలయెత్తిన సమస్యలు చాలవరకు కనడాలోనే పుట్టెను. కాని వాషింగ్టను రాయబారములకైన ఖర్చులో నొక చిల్లిగవ్వయైనను కనడా చెల్లింపలేదు."

(భారతవ్యయ కమిషను 1895 Vol. IV పే. 91, పేరా 235)

ఈ సందర్భములో భారతదేశమునుండి గుంజుకొనబడిన మొత్తము ధనమును రూపాయిలలో చెప్పుట (మారకపు రేటులలోని తేడాలనుబట్టి సొమ్ము చెల్లింపబడుటచే) చాలకష్టము. మాకు దొరికిన కాగితములనుబట్టి యీ మొత్తము కొంచెమించుమించు 900,000 పౌను లగుచున్నది.

32. చీనా రాయబార శాఖ:— ఈస్టుఇండియా కంపెనీవారికి చీనాతో వర్తకపు గుత్త పద్ధతియున్న రోజులలో కంపెనీవారు చీనాలోనున్న తమవర్తక ప్రయోజనములను చూచుటకుగాను కొద్దిమంది రాయబారుల నచ్చుటనుంచి వారికగు ఖర్చులను సహజముగా వారే భరించెడివారు. 1834లో గుత్త (monopoly) పద్ధతిపోయెను. అప్పటినుండి చీనాలోని బ్రిటిషువర్తక సూపరింటెండెంటుల కగు ఖర్చులో మూడవ

వంతు హిందూదేశము చెల్లించుకొనునట్లు యేర్పాటు చేయబడెను. దీనికై హిందూదేశము సంవత్సరమునకు 4000 పౌనులు చెల్లించుకొనెను. చీనాలోని రాయబారవర్గమున కగు ఖర్చులను గురించి నోరెత్తుటకు హిందూదేశమున కవకాశము లేదు. ఈఖర్చు లంతకంతకు యథేచ్ఛగా పెరిగిపెరిగి కొంతకాలము సంవత్సరమునకు 20,000 పౌనులు కూడనయ్యెను. భారతశక్రటరీగారు యింత హెచ్చుభారమును వేయుట అక్రమమని ఘోషించి సంవత్సరముకు 10 వేల పౌనులకంటె నెక్కువ భారతదేశముపై వేయరాదని కోరెను. ఈయరణ్యరోదనములను వినక, సంవత్సరమునకు 20 వేల చొప్పున 1876 వరకును సుంకముతీసికొనిరి. 1876 మొదలు 1890 వరకు 15 వేలకు తగ్గించిరి 1890 లో (భారతకార్యాలయమువారి నిరంతర మొఱలచేత) నీ విషయమును "విదేశకార్యాలయు కాన్ఫరెన్సు అనబడువారు చర్చించి దీనిని 12,500 కు తగ్గించిరి. ఈవిధముగా హిందూదేశము 1835 మొదలు 1843 వరకు సంవత్సరమునకు 4600, 1867 మొదలు 1876 వరకు సంవత్సరమునకు 20,000, 1876 మొదలు 1890 వరకు సాలీనా 15,000 పౌనులు చెల్లించెను. 1890 మొదలు 1900 వరకు సాలీనా 12,500 చెల్లించెను. 1901 లో వెల్బీకమీషను రిపోర్టుతరువాత నీభారము తొలగింపబడెను.

చీనాలో గ్రేటుబ్రిటను తరపున స్థాపింపబడిన రాయబారమునకగుఖర్చులలో గొంతమైనను భారతదేశముమీద నే సిద్ధాంతము ననుసరించి వేయబడెను? భారతదేశమునకు చీనా

లోగల వర్తకప్రయోజనమునకే యీ ధనమును దీసికొనినట్లు గాన్పించును. గ్రేటుబ్రిటనుకు చీనాతోగల వర్తకములో నాల్గవవంతు భారతదేశముకుగలదని చెప్పబడెను. సాలీనా 60 వేలు ఖర్చుకట్టి అందులో 15 వేలు భారతదేశమునకు బంచిరి.

(భారతవ్యయకమిషను 1896 Vol. I పే 481 ప్రశ్న 12431)

అది చాలయుక్తమైన రుసు మనిరి. ఈ సిద్ధాంతము మీాదనే దీనిని స్థిరపరచినచో హిందూదేశము వర్తకము చేయుచున్న యూరపు అమెరికాలలోని దేశములలోను, ఆస్ట్రేలియా, కేపులలోను నున్న రాయబారవర్గము ఖర్చులలోగూడ బంచుకొనియుండవలెను. ఇంతేగాక బ్రిటిషుకాలనీలు, ఆశ్రిత రాష్ట్రములుగూడ చీనాతో దమకుగల వర్తకమునబట్టి యీ ఖర్చులను బంచుకొనవలెను. భారతదేశముపై దీనిని విధించుటకుగల సిద్ధాంత మెంతమాత్రమును న్యాయమైనది, ధర్మమైనది కాదని స్పష్టమగుచున్నది. ఫాసెటు చెప్పినట్లు "హిందూదేశ మీా సుంకమును జెల్లించునట్లు మనము చేయగలము. దీనిని తిరస్కరించుటకు దానికెట్టి శక్తియును లేదు." ఇట్టి పరిస్థితులలో గ్రేటుబ్రిటను 1834 మొదలు 1901 వరకుచు హిందూదేశమునుండి పిండుకొనిన మొత్తము నంతను (సుమారు 10 లక్షల పౌనులకు తగ్గదు) తిరిగి యిచ్చివేయుట హిందూదేశమునకు న్యాయమును జేయుటమాత్రమే యగును.

**33.** జాంజిబారు, మారిషసు కేబిలు:— ఈస్టరన్ టెలిగ్రాఫ్కంపెనీ యను నొక కంపెనీ యీ కేబిలు (సముద్రములో

ని తంతిమార్గము)ను నిర్మించెను. దీనికి 200,000 పౌనులయ్యెను. ఈసొమ్మును హిందూదేశముచే గక్కించిరి. ఈతంతి ముఖ్యముగా రాజకీయ కార్యావసరములనుబట్టి వేయబడెను. దీని ఫలితముగా మారిషసు, సెషెల్సులు ప్రపంచపు టెలిగ్రాఫు లైనుతో గలుపబడెను. "ఇవి హిందూదేశమున కింగ్లండుతో నెట్టి నూతనబాటను గలిగింపలేదు. ఏడెను, ఆఫ్రికా తూర్పు పశ్చిమ తీరముల ద్వారా యది యిదివరకే చేకూరెను." భారత, సామ్రాజ్య, కాలనీల ప్రభుత్వముల తరపు వార్తలన్నియు నీ టెలిగ్రాఫుకంపెనీద్వారా నొకే స్థిరమైన రేటున బంపబడును. ఈ తంతివలన హిందూదేశమున కెట్టి ప్రత్యేక లాభమును జేకూరలేదు. అయినను నీ కంపెనీకి బ్రతివత్సరము కట్టబడు 28,000 పౌనులలో గ్రేటుబ్రిటను, మారిషసు, సెషెల్సులు వరుసగా 10 వేలు, 7 వేలు, 1 వేయి చెల్లించుచుండ హిందూదేశమునుండి 1893 మొదలు సాలీనా 10 వేలచొప్పున 20 వత్సరములు దండుకొనబడెను.

(భారతవ్యయ కమిషను 1895 Vol. II పే 370, Vol I పే 470 ప్రశ్న 12308, Vol. II పే 402)

ఈరుసు మొకనీతిని న్యాయమును బట్టి వసూలు చేయబడలేదు. స్టైఫెను జాకబు, సి. యస్. ఐ, యీతంతిని గురించి వెల్బీకమిషను కొక మెమొరాండమును బంపించెను.

(భారతవ్యయ కమిషను 1895, Vol II పే 402)

అది ఫాసెటుగారి సిద్ధాంతము ననుసరించి యీ చందా హిందూదేశమునుండి తీసికొనబడెనని స్పష్టముగా జూపుచు

న్నది. ఈధనమునంతను ఇంగ్లండునుండి పుచ్చుకొనుటకు హిందూదేశమున కధికారము లేదు.

34. ఎఱ్ఱసముద్రపుతంతి:—1858 లో ఎఱ్ఱసముద్రపుఇండియా టెలిగ్రాఫుకంపెనీ యను నొక కంపెనీ యేర్పడెను. దానికైన పెట్టుబడిమీద నూటికి $4\frac{1}{2}$ చొ॥లాభమును పుచ్చుటకు 50 సంవత్సరములవరకు ట్రెజరీనాహా పూచీపడిరి. కౌన్సిలు సభోపవిష్టులైన భారతశెక్రిటరీగారి యామోదముతోనే ట్రెజరీవారు పూచీయిచ్చిరట. కంపెనీవారొకరోజు లేకరోజుపూట వార్తలను పంపించిరి. వెంటనే ఆతంతిమార్గము ముక్కలై పోయెను.

(భారతవ్యయకమిషను, 1895 Vol I పే476 ప్రశ్న12314/15)

"తంతిమార్గము పనిచేయు పరతుమీదనే పూచీ యియ్యబడలేదు." అను నొక ఆక్టు 1861 లో చేయబడెను 1862 లో తంతిమార్గము వార్తలను పంపుట మానివేసెను. కనుక నీయాస్తి మఱియొకకంపెనీకి బదిలీ చేయబడెనని మరియొక ఆక్టు చేయబడెను. పాతకంపెనీ కీయవలసిన పూచీ 46 సంవత్సరములకు సంవత్సరమునకు 36,000 వార్షికముగా మార్చబడెను. సామ్రాజ్య బొక్కసమునకు హిందూదేశము సంవత్సరమునకు 18,027పౌనులు (వార్షికము, మేనేజిమెంటు ఖర్చులలో సగము) 1908 ఆగష్టు 4వ తేదీవరకు యిచ్చుకొనవలె నని శాసింపబడెను."

(భారతవ్యయకమిషను, 1895: Vol. II, పే. 370)

ఈవిధముగా హిందూదేశము 829,000 పౌనులు చెల్లించెను ఈఖర్చునకు భారతదేశ మెంతమాత్రమును బాధ్యురాలు కాదు. దీనికి ప్రతిఫలముగా భారతదేశ మొక్క చిల్లిగవ్వయైనను అనుభవించియెఱుగదు. ఈ మొత్త మంతయు తిరిగి హిందూదేశమునకు రావలసినసబబు కలదు. నూటికి 4 చొ॥ 22 వత్సరములకు వడ్డీ కట్టినచో మొత్తము 15 లక్షల పౌనులగును.

35. క్రైస్తవమతబోధకైన ఖర్చులు:— ఈ శాఖకు గూడ విరివిగా ఖర్చుచేయబడె ననుసంగతి మనము మరువ రాదు. ఈ యొక్క శాఖకే గత 35 వత్సరములలోను 70,00,000 పౌనులు ఖర్చుఅయ్యెను. ఈ సొమ్మును భారతదేశముమీద వేయుటకు సబబు లేదు.

36. బర్మా:— 1887 మొదలు 1907 వరకును బర్మా పరిపాలనలో బడ్జటులోపములు వచ్చెను. ఈ మొత్తము 15 కోట్లు అయ్యెను. దీనిని భారతదేశము భరించెను. ఇంతేగాక బర్మాదేశముయొక్క ఆర్థికాభివృద్ధికిగాను, ముఖ్యముగా బర్మా రైల్వేపెట్టుబడుల కయినవడ్డీయును, నష్టములును, 22 కోట్లు. దీనినికూడ భారతదేశమే భరించెను. కనుక నీ 37 కోట్లును హిందూదేశమునకు రావలెను. బర్మా కలుపుకొనబడినదిలగాయతు నేటివరకును భారతదేశరక్షణ కగుఖర్చులలో గొంత భాగము భారతదేశమునకు ముదరా రావలసియున్నది. ఇది మామూలు రాష్ట్రీయబడ్జటులలో జేర్చబడ లేదు. ఇది సాలీనా

దామాషాను కోటిచొప్పున 45 కోట్లు అని అంచనా వేయబడెను. కనుక బర్మాసందర్భములో మాకు మొత్తము 82 కోట్లు రావలెను.

37. కఱవుఖర్చులు:— సకాలములో వర్షములు కురియకపోవుట లేక యొకచోట నతివృష్టి నుండియొకచోట ననావృష్టికారణములచే ప్రజల స్వజనశక్తి చాల తగ్గి వారి కమిత దుఃఖకారణ మగుచున్నది. ఈ బాధను నివారించుటకు, ననగా ననేకలక్షలమంది యన్నాతురుల యాకలిచిచ్చును జల్లార్చుటకు మాత్రమే భారతాదాయముపై నెంతయో యొత్తిడి కలుగుచున్నది. ఇట్టి కఱవుకాటకములకు బడ్జటులో తగినంత ధనమును బ్రత్యేకింపక పూర్వము వెనుకటిరోజులలో మామూలు బడ్జటు లిట్టితాకుడుకు దాళజాలవు. కావున భారతప్రభుత్వము వారు పెద్దపెద్ద ఋణములను జేసెడివారు. 1870-80లలోవచ్చిన కఱవులకు 14,607,000 పౌనులయ్యెను. కాని 1896-97 లో వచ్చిన ఒక్కకఱవుకు $10\frac{1}{4}$ కోట్లు అయ్యెను. 1899-1900 కఱవుకు 17.08 కోట్ల రూపాయ లయ్యెను. ఈ ఋణము క్షుద్బాధితులైన భారతీయులదుఃఖనివారణకొఱకు జేయబడినది. కనుక భారతదేశము దీని నిచ్చుకొనవచ్చును. 1879 లగాయితు (1878 లో కఱవునివారణకొఱకైన యమిత ఖర్చులవలన జ్ఞానోదయమయి) దీనికొఱకై సాలీనా 10 లక్షల పౌనులు వచ్చు క్రొత్తపన్ను విధింపబడెను. ఈ నిధిని యీ క్రిందిపనుల కుపయోగింపవలెను.

(1) కఱవు సంభవించిన సంవత్సరములలో క్షుధాతురులైనవారి బాధనివారణకొఱకు.

(2) రక్షణనిచ్చునట్టి యిరిగేషను పనులు లేక రైల్వే పనుల కొఱకు.

(3) కఱవులేనిసంవత్సరములలో నిఋణములను తగ్గించుటకు లేక లేకుండచేయుటకు.

కాని కఱవులేని సంవత్సరములలో నీ నిధికి ఏర్పడిన ధనమును ప్రభుత్వము వారు తరుచుగా పైన పేర్కొనబడిన వాటికి గాక తమ యిష్టమువచ్చినట్లు ఖర్చుపెట్టిరి. దీని ఫలిత మేమయ్యె ననగా 1896-97, 1899-1900 లలో పెద్ద పెద్ద కఱవులు వచ్చినపుడు వాటి నెదుర్కొనుటకు తగిన మూల ధనము లేక పోవుటచే ప్రభుత్వము వారు క్షామనివారణకొరకు క్రొత్తఋణములను చేయవలసివచ్చెను. ఈ నిధిని సరిగా నిర్వహించినచో నిట్టి యవసరము లేకుండెడిది. ఈ ఋణ మునకు సన్నిహితకారణము లేవియైనను, దీని మొత్తము భార మెంతయైనను హిందూదేశ మిట్టిఋణములకు బాధ్యత నంగీకరించుటలో వెనుకాడదు.

38. మారకపు నష్టము:—రూపాయి పౌను మారకపు రేటు అనేకకష్టములకు, చిక్కులకు కారణమయి మితిలేని నష్టములను కలుగజేసెను. చాల విషయములలో నిట్టినష్టము లను సరిగా లెక్కించుట సాధ్యముకాదు. భారతప్రభుత్వము వారి మారకపునీతి నంతను విమర్శనబుద్ధితో నిచ్చట పరీ

క్షించుట మా యుద్దేశము కాదు. కాని కృత్రిమపరిమాణము నెట్లోనిలబెట్టుటకీమధ్య చేసినప్రయత్నములును తత్ఫలితముగా గలిగిననష్టములును భారతపరిభుత్వమునకూడ నిట్టినీతివలన గలుగుచున్నదుష్ఫలితములను గుర్తింపజేయుటకు జాలును. మే మిపుడు జర్చింపబోవువిషయ మీమార్గముద్వారా భారత దేశముపై లెక్కింపగలంతవరకు నెంతనష్టము లేక దండుగ లేక భారము రుద్దబడెనో సూచించును. భారతపరిభుత్వము వారిమారకపునీతి భారతదేశమున కెక్కువనష్టమును గలిగించి ప్రజాఋణమును బెంచివేసెను. హిందూదేశములోను నింగ్లం డులోను వేర్వేరు ద్రవ్యపరిమాణము లుండుటచేతను, ప్రతి సంవత్సరము భారతపరిభుత్వమువారు పెద్ద పెద్ద మొత్తములను పౌనులలో "ఇంగ్లండులో జరుగుఖర్చులకు" ఇచ్చుకొనవలసి యుండుట చేతను, రూపాయిపౌనుమారకమును నిర్వహింపవల సిన యవసరము గలిగెను. భారతాదాయమంతయు రూపాయిల లో వసూలుజేయబడును. కాని యీ జీతములను పౌనులలో గ్రుమ్మరించవలెను. కనుక రూపాయి పౌనుమారకము ఆర్థి కముగా స్థిరముగా నున్నంతకాలము మారకపుపద్ధతిలో నె క్కువ చిక్కులుకాని "గూబగుయ్యి మనునట్టి" నష్టముకాని రాలేదు. 1873 నుంచి మొదలు రూపాయి బంగారమువరవడికి గ్రమముగా తగ్గ నారంభించెను. అందుచేత భారతపరిభుత్వ మువారు ఈ పౌనుకట్నములను జెల్లించుటకంత కంత కెక్కువపన్నులను, నెక్కుడుఆదాయమును వసూలుచేయ వలసివచ్చెను. వెల్బీకమిషనువారు చెప్పినట్లు విదేశనాణె

ములో జెల్లింపవలసిన యీ కట్నములను తగ్గించి తగ్గించి, చివరకు లేకుండ జేసికొనుట బుద్ధిగలమార్గము. అట్లు చేయక భారత ప్రభుత్వమువా రేలాగో రెండవపంథను బట్టి రూపాయివిలువను పౌనుతో ముడిపెట్టుచువచ్చిరి. 1893 కు పూర్వము వెండితీసికొనివెళ్లి ప్రతివాడును భారతనాణెముల ముద్రాలయములలో నెట్టి సుంకమును అక్కరలేకుండ నుచితముగా రూపాయి నాణెముల నచ్చొత్తించుకొనెడివారు. 1893 లో వీటిని బందు చేసిరి. ఈ విధముగా కృత్రిమముగా రూపాయి నరికట్టుటచేత ప్రభుత్వమువారు పైన జేర్కొనబడిన నీతి నవలంబింపవలసి వచ్చెను. ముద్రాలయములను మూయుటచే రూపాయివిలువ (నాణెములో) తప్పని సరిగా హెచ్చెను. ప్రభుత్వమువారు రూపాయివిలువను 16 పెన్నీలకు స్థిరపరచిరి. హిందూదేశములో బంగారుప్రమాణమును స్థాపించెద మని చెప్పి దానికొఱకు 1899 లో గొన్నిచర్యలను జరిపి పదునారు పదునేడు సంవత్సరములు రూపాయివిలువ నట్లే కాపాడిరి కాని యీ లోపున బంగారుప్రమాణమును బ్రవేశపెట్టువిషయమును చల్లగా జాఱ విడిచి కృత్రిమముగా పెంచబడిన రూపాయివిలువచే వెండిని నాణెముగా ముద్రించుటవలన జేకూరినలాభమును బంగారుప్రమాణనిధి (Gold Standard Reserve) యను నొకనిధికి జేర్చి 40,000,000 పౌనుల సెక్యూరిటీలమీద పెట్టుబడి పెట్టి లండనులో దాని నంతను భద్రపఱచిరి.

ఈ సందర్భములో నీ కారణములవలననే వర్తకములో గలిగిననష్టములను, భారతదేశపు వెండిధరలలోనివట్టములను గూడ చర్చింపవలసియున్నది మారకవ్యాజమున భారతేతరులైన భారతప్రభుత్వనౌకర్లకు (వారి జీతములు రూపాయలలో నీయబడును.) రూపాయియొక్క మారకపు విలువ తగ్గిన దనుకారణమున ప్రత్యేకలాభములు చేకూర్చబడెను. రూపాయి పౌను మారకము పడిపోవుచున్నపుడు ప్రభుత్వమువారు తమ భారతేతరనౌకర్లకు మారకతేడాకుగాను ప్రత్యేక అలవెన్సులను గలిగించిరి ప్రభుత్వమువారు తమ నౌకర్లకు రూపాయిలలో మాత్రమే జీతముల నీయవలసినవిధి యుండగ నిట్టి ప్రత్యేకమారకలాభములను వారికి గలిగించుటలో నెట్టి న్యాయమును లేదు. సంవత్సరమునకు దామాషాను 15 లక్షలచొప్పున నీ యొక్కదానిమీదనే 35 సంవత్సరములలో 5 కోట్ల రూపాయిల పైగా నగుచున్నది.

39. రివర్సుకౌన్సిలుబిల్లులమీదనష్టము:-1920-21లో జరుపబడినతంతు మరింత దుఃఖభాజన మైనది; కంటికి స్పష్టముగా గాన్పించుచునది. అంతకుబూర్వము స్థిరపరుపబడిన ప్రమాణమును రక్షింపవలె ననునాసతో భారతసెక్రిటరీగారు భారతప్రభుత్వమువా రతనిమీద (లండను) అమ్మిన రివర్సుకౌన్సిలుబిల్లులకు ధనమును జేకూర్చుటకు భారతప్రభుత్వము వారికి జెందిన 200 లక్షలు విలువగల సెక్యూరిటీలను అమ్మివేయవలసివచ్చెను. ఈ సెక్యూరిటీలు రూపాయి 16 పెన్నీలు

విలువమైనపుడు భారతనిధులనుండి కొనబడెను; రూపాయి 35 పెన్నీలలోనున్నపుడివి యమ్మివేయబడెను. 1920-21 సంవత్సర బడ్జెటులో నీ యొక్కదానివలన గలిగిననష్టమే (ఆవత్సరము ప్రభుత్వమువారు మామూలుగా నింగ్లండుపంపుకోవలసిన జీతములు వగైరాలమీద వచ్చిననష్టముగాక) 23½ కోట్లు అని తేల్చబడెను. క్రొత్తరేషియో యేర్పడుటచే కాగితపు కరెన్సీ నిధిలోని సెక్యూరిటీలను తిరిగి ధరలుకట్టుకొనుటలో గలిగిననష్టమును, తత్సంబంధమగుఅకౌంటులలో గలిగిన నష్టమును ద్రవ్యరూపములో గణించుట కష్టతరమైన పని. 1920-21 లోను తరువాతను లెక్కకువచ్చినయాంకెలను మాత్రమే తీసికొనినచో మొత్తపునష్టము 35 కోట్లరూపాయల వరకు తేలుచున్నది. తరువాత మారకముమూలమున ప్రభుత్వమునకు రెండు లేక మూడు వత్సరములలో 8 కోట్లరూపాయలు నష్టము వచ్చెను.

— —

# నాల్గవ భాగము.



## బ్రిటిషు ప్రభుత్వముక్రింద - "ఫలోత్పత్తి" గల ఋణములు.

40. "ఫలోత్పత్తి"గలఋణములు:—ఈ"ఫలోత్పత్తి" గల భారతప్రభుత్వ ఋణములను యీక్రింది తరగతుల క్రింద విభజింపవచ్చును:—

(1) ప్రభుత్వమువారు నిర్మించి తమ యధీనములోనే యుంచుకొని తామే నిర్వహించుచున్నరైల్వేలకు చేసిన ఋణములు లేక ఒప్పన్నములును, లేక మొట్టమొదటి రైల్వేలను నిర్మించినకంపెనీలనుండి వానిని కొనుటచే నయినఋణములు, లేక ఒప్పన్నములు1929 30 సంవత్సరాంతమునకు ఈ మొత్తము 736.93 కోట్ల రూపాయి లని చూపబడెను. ఇదిగాక ప్రభుత్వమువారు రైల్వేవ్యాపారమును తమ చేతిలోనికి తీసికొనినతరువాత చాల రైల్వేలను గ్యారంటీదుకంపెనీలకు కవులిచ్చి వానిని నిర్వహించుకొను మనిరి. ఈ కంపెనీల వారు పెట్టిన పెట్టుబడి 33 20 కోట్ల రూపాయిలు ప్రభుత్వమువా రిచ్చుకొనవలెను. ఇందులో ప్రభుత్వము వారు పశ్చిమోత్తర రైల్వేకొఅకు చేసిన 146.467 కోట్ల రూపాయిల ఋణము కలదు. ఈ రైలుమార్గము మొట్టమొదట కేవలము రాజకీయహేతువులచే నిర్మింపబడెను. ఇప్పటికిని దీనిలో నొకభాగము 33 387

కోట్ల ఋణమునకు గారణమైన దానిని రాజకీయహే
తువులచే నిర్మింపబడినదే యని యొప్పుకొనుచు దాని
నా తరగతిలో జేర్చుకొనిరి.

(2) ప్రభుత్వమువారు నీటిపారుదలపనులకు (ఉత్పత్తికొఱ
కును కేవలము రక్షణకొఱకును) జేసినఋణములు
లేక ఒప్పన్నములు 1828-29 సంవత్సరాంతమున
కివి 123 02 కోట్ల రూపాయి లని చూపబడెను.

(3) తపాలా, దానికి సంబంధించిన శాఖలవంటి ప్రభుత్వ
వర్తకశాఖలకొఱకు జేసిన ఋణములు. ఇవి 1929-30
సంవత్సరాంతముకు 23.05 కోట్ల రూపాయి లయ్యెను.
ఇప్పుడీ ఋణములలో గొంతమాత్రమే నిలిచియున్నది.

(4) రాష్ట్రములలో జరిగిననీటిపారుదలపనులకు, పుర
పాలకసంఘములకు, పోర్టుట్రస్టులకు అనగా రేవులకు
సంబంధించినధర్మకర్తృత్వములకు అప్పుచెప్పబడిన
యభివృద్ధికొఱకు జేయబడినఋణములు, బొంబాయి
యభివృద్ధివంటి సాహసకార్యముల కుపయోగింపబడిన
ఋణములు తీసివేయగా మిగిలిన తాత్కాలిక ఋణ
ముల మొత్తము (గుండ్రసంఖ్యలో) 19.00 కోట్ల
రూపాయిలు.

(5) భారతసంస్థానముల కిచ్చినఋణములు. ఇవి మొ
త్తము 17.5 కోట్లరూపాయలు.

41. రైల్వేలు:— "ఫలోత్పత్తి" గల ఋణము లన బడు నీవివిధతరగతులను వరుసగా దీసికొనుచు మన మిపుడు రైల్వేఋణముల స్వభావమునుగురించి చర్చింతము. ఇవి దేశ ముయొక్క సామాన్యఆర్థికాభివృద్ధికి సహాయకారులు; లేక సౌకర్యములు. ఒకచోట నుత్పత్తియగువస్తువుల నవి ఖర్చగు ప్రదేశములకు గొంపోవుచు వాటికి రైల్వేలు స్థానికవిలువను దెచ్చిపెట్టుచున్నవి. ఈ విధముగా వస్తువుల కనేకములును, విశాలములును నగుసంతలను గల్పించుటచే నివి వస్తువుల కెక్కువ చెలామణీతనమును గలిగించి యప్రత్యక్షముగా క్రొత్తసంపత్తు నభివృద్ధిచేయుటకు దోడ్పడుచున్నవి. కాని యివి వాటంతటవియే క్రొత్తసంపత్తును దేనిని (నీటిపారుదల పనులవలె) సృష్టించుచున్న వని చెప్పుటకు వీలు లేదు. అయి నను సంకుచితమైన ఆర్థికదృష్టితో జూచితిమేని (భారత ప్రభుత్వమువారి ఆస్తి దానికై వారు చేసినఋణభార మునకు సరిపోవునంతటి యాదాయము నిచ్చునదిగా నుండు టచే) రైల్వేఋణమునకు ఫలము నిచ్చుస్వభావము గల దని, లేక దానివెనుక సంపాదన చేయునట్టి ఆస్తికల దని, మన మొప్పుకొనవచ్చును. కాని యీ బాకీని నెత్తిమీద వేసికొ నుట కంగీకరించుటకు బూర్వము ఈశాఖకు జెందినభారత జాతీయఋణ మనబడుదానిపుట్టుకను, అభివృద్ధినిగుఱించి పరీ క్షించి దీనిపుట్టుకలో గాని అభివృద్ధిలో గాని కళంకమున్నచో మన మిందులో గొంతభాగమునుండియైనను విముక్తుల మగుట కవకాశ ముండునేమో చూడవలసియున్నది.

ప్రస్తుత మున్న జాతీయఋణములో రైల్వేఋణము పేరిట నున్న ఋణ మొక్కటియే అన్నివిధములైన యితర బాపతులఋణములకంటెను కూడ నెక్కుడుగా నున్నది. ఈ ఋణ మంతయు రైల్వేలకొఱకు ప్రభుత్వమువారే చేసియుండలేదు. ఇందులో జాలవరకు రైల్వేకంపెనిలవారు మొట్టమొట పెట్టుబడిపెట్టిన బాపతు మూలధనము. రైల్వేలకొఱకైన సివప్రభుత్వఋణము 736.93 కోట్లరూపాయిలైనట్లు 40 వ పేరాలో జూపబడినది. దానినీ క్రిందివిధమున విభజింపదగును.

(a) స్వయముగా ప్రభుత్వమువారి చేతనే నిర్మింపబడిన రైల్వేలకొరకు జేసినఋణము. వీటికైన ఖర్చును సరిగా నిర్ణయించుట కష్టతరము. ప్రభుత్వమువారు ఋణముచేసి స్వయముగా రైల్వేలను నిర్మించుపద్ధతి 1869 లగాయతు పది పండ్రెండు వత్సరములు మాత్రమే (1881 వరకు) నమలులో నుండెను. ఈ కాలములో ప్రభుత్వమువారి చేతనే నిర్మింపబడి ప్రభుత్వము వారి యధీనములోనే యుంచుకొనబడిన రైల్వేలకైన మొత్తము సర్ జాన్ స్ట్రాచీగారి ప్రకారము 26,689,000 పౌనులు. ప్రభుత్వమువారు తమ తాత్కాలికాదాయములనుండి లేక కరవు భీమానిధినుండి రైల్వేలు నిర్మించుటకును, పెంచుటకును చేసిన ఖర్చు ఇందులో జేర్చబడలేదు.

(b) పాత లేక క్రొత్త గ్యారంటీడు కంపెనీలనుండి కొని యిపుడు ప్రభుత్వమువారే నడుపుచున్న రైల్వేలు.

రైల్వేలక్రిందకు వచ్చుఋణములో నీ శాఖకు జేరు ఋణమే యన్నిటికంటె హెచ్చుమొత్తము.

(c) ప్రభుత్వమువారిచే కప్పము లేక వార్షికము పొందిన కంపెనీలచే నిర్మింపబడిన రైల్వేలు.

మొదటి తరగతిలోని యాస్తియొక్క యథార్థమైన విలువ యెంతయైనను నీ తరగతిక్రిందకు జేరిన ఋణము యొక్క న్యాయాన్యాయములను తర్కింప నవసరము లేదు. ఇక రెండవదానివిషయమై రైల్వేలను నిర్మించుటకు కంపెనీలకు గొంత కనీసవడ్డి నిచ్చెద మని పూచీపడుపద్ధతి న్యాయము కాదు. ఇది యాక్షేపణీయము. అనేకములైన తగు కారణములను జూపి మొదటినుండియు దీనిని వారింప బ్రయత్నించుచునే యుండిరి. ఈ కారణములను సౌకర్యార్థ మీ క్రింది ప్రధానశీర్షికలక్రింద నుదహరింపవచ్చును.

(1) అప్పటి బజారువడ్డీ రేటులను జూచినచో నట్టి పెట్టుబడులకు గ్యారంటీడు కంపెనీలవారి కిచ్చుటకు పూచీపడిన కనీసమొత్తము చాల హెచ్చుమొత్త మని చెప్పకతప్పదు.

(2) పూచీగా వడ్డీదొరుకునట్టిపద్ధతి యుండుటచే నీ రైల్వేలను నిర్మించుటకు, బనిచేయుటకు బాధ్యత వహించిన కంపెనీలవారు తాము చూపవలసిన పొదుపును జూపలేదు. తత్ఫలితముగా వీటికొఱకు పెట్టబడిన మూలధనము ఇష్టమువచ్చినట్లు పెరిగెను. దీనిని నడపుటలో

దారుణమైన పారు లేక దూబరా కలిగెను. వీటివలన పూచీగా చెల్లించుకొనవలసినవడ్డీ యనవసరముగా పెరిగిపోయెను.

(3) ఈ కంపెనీలకు భూములు మొదలైనవానిని నుచితముగా ధారపోయుటచే భారతఖజానామీద క్రొత్త భారము పడుటయు కంపెనీలకు చాల లాభము చేకూరుటయు కలిగెను. దీనికి సరియయిన అక్కౌంటు నుంచకపోయినంతమాత్రముచే నిది హెచ్చుభారము కాకపోలేదు.

(4) మొట్టమొదట నిచ్చిన పూచీయొక్క కాలపరిమితి యగుటతోడనే లేదా సదరు ఆస్తులను తీసికొనుటకు తగిన మొదటి యవకాశము లభింపగనే యీ ఆస్తులను వశపరచుకొనుటకు చేసికొనబడినషరతులు భారతప్రజలపై క్రొత్తభారములను దెచ్చిపెట్టుటగా బరిణమించుటయేగాక ఈ విధముగా సంపాదింపబడిన యాస్తిని నిర్వహించుటకు తరువాత చేయబడిన యేర్పాటులు గూడ తత్తుల్యమైన నిందకే పాల్పడుచున్నవి.

(5) మొట్టమొదటి పూచీకంట్రాక్టులను తిరిగి యిచ్చుటలో జరిగినషరతులును, కప్పము లేక వార్షికము పొందినకంపెనీలతో తిరిగి చేసికొనబడినషరతులును చాలవరకు క్రొత్త భారములను దెచ్చిపెట్టెను.

(6) పూచీయియ్యబడినకంట్రాక్టులలో మారకము సందర్భములలో (22 పె = 1 రూపాయి) అని స్థిరమైన రేటు

చొప్పున నిచ్చుటకు జేసికొనబడిన షరతులవంటి యీ భారములను దారుణముగను, అన్యాయముగను వృద్ధిచేసెను.

42. పూచీగా వడ్డీ నిచ్చు పద్ధతి:—ఈ కారణములను క్రమముగా తీసికొని యాకాలమునాటి లెక్కలను పరిశోధింతిమేని మొట్టమొదటి గ్యారంటీడు (అనగా పూచీ యియ్యబడిన) రైల్వేకంపెనీలకు వారుపెట్టిన పెట్టుబడిమీాద నూటికయిదు రూపాయిలచొప్పున నఫా రాకిచో దానిని భారతదేశము యొక్క సామాన్యాదాయమునుండి భర్తీచేయుటకు ప్రభుత్వము వారు భీమా యిచ్చుటయు, భారతదేశముయొక్క లేక యింగ్లాండుయొక్క కేంద్రద్రవ్యసంత (Central money market) నుండియే ఆభారత ప్రభుత్వమునకే నూటికి 3½చొప్పున అప్పు పుట్టుచుండుటయు మొదలగుసంగతులు విశదము కాగలవు. యుద్ధములు మొదలగు ఫలోత్పత్తి లేనిపనులకును, క్రొత్తగా కలుపుకొనబడినరాష్ట్రపాలనలో గలిగినలోటులను భర్తీ చేయుటకును ప్రభుత్వముచారు ఋణము చేయుచునే యున్నారు. ఋణదాతకు మంచి విశ్వాసమును కలిగించునట్టి యాస్తులు వీని వెనుక లేవు. ప్రభుత్వమునకు సామాన్యముగా ఋణము నిచ్చుఋణదాతలకు రైల్వేలవలె లాభముల నిచ్చుసంస్థలలో నెప్పటికైనను భాగస్వాములము కాగలమను నాశయూ లేదు. అయినను ప్రభుత్వమువారు తామే భారతదేశములో నూటికి నాలుగుచొప్పున వడ్డీకి ఋణమును దీసికొనగలిగియుండియు నా సంవత్సరములలో నూటి కయిదు

చొప్పున కనీసలబ్ధిని వాగ్దానము జేసిరి! ఇంతేకాదు మరియొక చిత్రమేమన, మొదట నీ రైల్వేవ్యాపారమును జేయ సాహసించినవారు తమంత తాము 3% మాత్రమే ప్రభుత్వము వారు పూచీయిచ్చిన చాలు ననుచుండ ప్రభుత్వము పైవిధముగా దమ యుదారతను జూపిరి.

(భారతదేశములోని రైల్వేసీకు: హెచ్. బాల్, 1891. పే. 2)

1849-55 సంవత్సరముల మధ్య స్థాపింపబడిన గ్యారంటీడు కంపెనీలు చాలవరకు దమతమ కంట్రాక్టు పద్ధతుల ననుసరించి యిదివరకే ప్రభుత్వమువారిచే దీసికొనబడెను.

క్రిందసెక్షనులలో నుదహరింపబడు వాదములను సరిగా నర్థము జేసికొనుటకు అగ్రిమెంటులలోని ప్రధానలక్షణములను జూపుట శ్రేయస్కరము. మొట్టమొదటి గ్యారంటీడు కంపెనీల కంట్రాక్టులలోని ప్రధానపరతు లిట్లుండెను:—

(1) 99 సంవత్సరములవరకు నెట్టిమూల్యమును లేకుండ ప్రభుత్వమువారు రైల్వే పనులకొఱకు గావలసిన భూమి నంతను నుచితముగా నిచ్చుట.

(2) కావలసిన మూలధనమును కంపెనీలవారు తెచ్చుకొనుట. అట్లు పెట్టుబడి పెట్టబడిన మూలధనముమీద ప్రభుత్వమువారు 5% చొప్పున (కొన్ని సందర్భములలో $4\frac{1}{2}$ లేక $4\frac{3}{4}$%) పూచిగా వడ్డీ ముడుపు లండనులో చెల్లించుట.

(3) కంపెనీవారు మూలధనమును లండనులోగాని భారత దేశములోగాని ప్రభుత్వఖజానాలో చెల్లించుట, ఇంగ్లండులోగాని భారతదేశములోగాని కట్టవలసిన కట్టడములకు ధనము కావలసినపుడు ప్రభుత్వమువారిచ్చుచుండుట, కంపెనీలవారు భారతదేశములో చెల్లించునట్టిగాని తీసికొనునట్టిగాని మొత్తము లన్నింటికిని రూపాయికి 22 పెన్నీల చొప్పున మారకము నిర్ణయింపబడెను.

(4) రైల్వే కంపెనీల వ్యవహారములు ప్రభుత్వమువారి నిఘాలోను సామాన్య తనిఖీలోను నుండుట.

(5) రైల్వేలవలన వచ్చు లాభములనుండి వానిని నడపుటకగు ఖర్చులను తీసివేసినతరువాత, ప్రభుత్వమువారు పూచీపడినవడ్డీకొఱకు చెల్లించు పైకమును తీర్చివేయవలెను. మారకము స్థిరముగా రూపాయికి 22 పెన్నీలు నిర్ణయము. వడ్డీలోటులను భర్తీచేసికొనినతరువాత మిగిలినలాభములు మొదట కేవల మొక్కవాటాదారులే ఆహుతి చేసెడివారు. కాని కొంతకాలమైన తరువాత పూచీలకును, నడిపించుటకును మొదలగు ఖర్చులన్నిటికిని తీసివేయగా మిగిలిన లాభములను కంపెనీలవారును ప్రభుత్వమువారును సమముగా పంచుకొనుట కేర్పాటులు చేయబడెను.

(6) ప్రభుత్వమువారి తపాలును ఉచితముగా తీసికొనిపోవు టకును సైన్యములను తత్సంబంధమైన భాండారము లను తగ్గింపు రేటులకు తీసికొనిపోవుట.

(7) కంపెనీలు ప్రభుత్వమువారి యామోదమును బడసిన పరతులు, రేటులు, కిరాయిలు ప్రకారము ప్రజలను రైల్వేల నుపయోగించుకొననిచ్చుట.

(8) 99 సంవత్సరముల యనంతరము (ప్రభుత్వమువారిచే నామోదింపబడినవి తప్ప) ఎట్టిఋణములు, ఇతర ఖర్చులు మొదలగువానితో సంబంధము లేకుండ శాశ్వతరైలుమార్గము, (pe rmanent way) భూమి మీద స్థిరముగా నమర్చబడిన వన్నియు ప్రభుత్వము వారిసొత్తగును. మధ్యవర్తులు నిర్ణయించు క్రియము లకు కంపెనీలు మిషనులను బండ్లను రైల్వేకు సంబం ధించినసంస్థ నంతను విక్రయించుట, ప్రభుత్వమువా రా ప్రకారము కొనుట.

(9) మొదటి 25 వత్సరములు లేక 50 వత్సరముల అనంత రము రైల్వేకు సంబంధించిన వాటాల నన్నింటిని కొని కాని మూలధనమునంతను చెల్లించికాని (తాము కొను తేదీకి లండనులో మూడువత్సరముల కాలములోనున్న ధరల దామాషాను నిర్ణయించుకొని ప్రభుత్వము వారు) రైల్వేనంతను కొనివేయుటకు హక్కు గలిగి యున్నారు.

(10) రైల్వేమార్గము పూర్తియయి మూడు నిండుమాసములు సరిగా పని జరిగింపబడినమీాదట కంపెనీలవారు ప్రభుత్వమువారికి రైల్వేల నిచ్చివేయుటకు హక్కుగలిగియున్నారు. వా రట్లు చేయదలచుకొనినచో సదరు రైల్వేలమీాద కంపెనీలు పెట్టిన మూలధనము నంతను ప్రభుత్వమువారు చెల్లించితీరవలెను.

మొదటి గ్యారంటీడు కంపెనీలతో చేసికొనబడిన కంట్రాక్టుల ప్రధానలక్షణము లీవిధముగా నుండెను. 1866-67 లో కంట్రాక్టులు తిరిగి వ్రాసికొనుటలో నొక ముఖ్యమైన మార్పుచేయబడెను. మారకము 22 పెన్నీల నుంచి 24 పెన్నీలకు మార్చబడెను. 1872 లో భారత సెక్రెటరీ గారు, భారతప్రభుత్వమువారిని తోసిరాజని, మరల నీ కంట్రాక్టును తిరుగదోడిరి ఏ విధముగను చెక్కుచెదరనట్టి కనీసపులబ్ధి వచ్చునట్టి పూచీ యుండబట్టి యీా గ్యారంటీడు రైల్వేకంపెనీల యధికారులు రైల్వేనిర్మాణమునందుగాక, దానిని నడుపుటలోగాని యేమాత్రము పొదుపును జూపక బహునిర్లక్ష్యముగా సంచరించిరి. ప్రభుత్వమువారిచే నిర్మింపబడిన రైల్వేలతో పోల్చిచూచినచో నీ గ్యారంటీడు రైల్వేలలో నెంతదూబరా, యెంతపారు గలదో (రెండును నేకకాలమున నిర్మింపబడుచున్నను) యీా క్రింది యంకెలవలన స్పష్టము కాగలదు. పెట్టిన పెట్టుబడికి పూచీ యియ్యబడుటచే

వారెంత మూలధనమును వెచ్చించినట్లు చూపిన నంత లబ్ధి హెచ్చుచుండును.

1884 లోని సెలెక్టు కమిటీవారి రిపోర్టునుండి (పే. 771-781) తీయబడిన యీ క్రింది యంకెలు భారతదేశములో గ్యారంటీపద్ధతికిక్రింద నిర్మింపబడిన రైల్వేలయొక్క అధికవ్యయమును చూపుచున్నవి.

1. ప్రాతగ్యారంటీపద్ధతి, డిసెంబరు 31, 1880.

| రైల్వే పేరు | మైళ్ళు | గేజి. అ-అం | మైలుకైన మూలధనము 1880 పౌనుs. |
|---|---|---|---|
| యి. ఐ ఆర్. | 1504.25 | 5–6 | 2,19,643 |
| జి. ఐ. పి | 1275.75 | ,, | 1,95,945 |
| సి. అండు యస్. ఇ. | 28.00 | ,, | 2,37,137 |
| మద్రాసు రైల్వే | 858.00 | ,, | 1,29,572 |
| యస్. పి అండు డి. | 663.50 | ,, | 1,66,470 |
| తూర్పు బంగాళారైల్వే | 158.00 | ,, | 2,08,035 |
| ఔధ్ అండు రోహిల్కండు | 546.75 | ,, | 1,05,709 |
| దక్షిణయిండియా రైల్వే | 645.25 | 3–$\frac{3}{8}$ | 64,584 |
| బి. బి. అండు సి. ఐ. | 144.00 | 5-6 | 1,86,582 |
| II. ప్రభుత్వ రైల్వేలు. 1869 లగాయతు స్వయముగా ప్రభుత్వనిర్మితములు. | | | |
| సింధు వేలీ రైల్వే | 653.00 | 5-6 | 1,06,099 |
| ఉత్తరపంజాబు రైల్వే | 224.75 | ,, | 1,78,138 |

| | | | |
|---|---|---|---|
| సింధియా రైల్వే | 66.50 | 5′-6″ | 1,22,585 |
| నాగపూరు - ఛాలిస్గరు | 53.00 | ,, | 57,315 |
| వార్ధాబొగ్గురైల్వే | 46.50 | ,, | 1,11,156 |
| ధాంధు-మన్మాడ్ రైల్వే | 145.75 | ,, | 71,756 |
| పాట్నా- గయా రైల్వే | 57.00 | ,, | 56,508 |
| డిల్లరునాగరు-ఘూజిపూరు | 12 00 | ,, | 60,480 |
| ఉత్తరబంగాళా రైల్వే | 243.50 | 3-3⅜ | 80,796 |
| టిర్హాటు రైల్వే | 85.00 | ,, | 62,821 |
| మటారి-హాతాిసు రైల్వే | 20.00 | ,, | 37,523 |
| కాన్పూరు- ఫరూఖాబాద్ | 86.50 | ,, | 36,196 |
| రాజపుటానా రైల్వే | 826.57 | ,, | 62,989 |
| హోల్కారు- సింధియా | 189.22 | ,, | 1,09,500 |
| రంగూన్- ఐరావతీవేలీ | 161 0 | ,, | 76,443 |
| పశ్చిమరాజపుటానా | 82.63 | ,, | 76,452 |

ఒకేవిధమగు రైల్వేలైనును నిర్మించుటకు ననగా నొకే గేజిని నిర్మించుటకు, నొకే లక్షణము గల దేశములోనే నిర్మించుటకు గ్యారంటీడు రైల్వేకంపెనీలవారికి ప్రభుత్వమువారు స్వా ముగా నిర్మించినదానికంటె రెండరెట్లు ఖర్చు అయ్యెను. పైగా గ్యారంటీడు కంపెనీలవారీ రంగములోనికి మొట్టమొదట దిగుటచే తమ మాటకు తాము చాల సుళువైనట్టియు, నెక్కువ రాబడీ వచ్చునట్టియు ప్రదేశములనే యెన్నుకొని తక్కువ రాబడివచ్చుచోట్లను ప్రభుత్వమువారికి విడిచివేసి రచు సంగతిని జ్ఞప్తియందుంచుకొనవలెను.

మొదటి గ్యారంటీ పద్ధతిలోనున్న (కళ్ళకు కట్టినట్లు కాన్పించు) చెడుగు లన్నియు సంగ్లండు భారతదేశములలోని తత్సంబంధము గల యధికారు లందఱును దెలియఁ బోలేరు. తత్ఫలితముగా భారత ఆదాయములపై బడు భారము నంతను అపుడు భారతవ్యవహారములను దిద్దుచుండిన యధికారు లందరును బూర్తిగా గ్రహించియుండక పోవచ్చును. కాని గ్యారంటీపద్ధతియొక్క సిద్ధాంతమే మూలములోనే యెంతకళంకిత మైనదో చూపుటకు బాధ్యతగల కమిటీముందర ననుభవశాలురైన యధికారు లిచ్చిన యభిప్రాయములలోని యీ క్రింది యుదాహరణముతే చాలును *

ప్రజలకు చాల లాభకరముగా నుండు షరతులమీద నొక ప్రత్యేకప్రజాకార్య ఋణముపేర ధనమును తీసికొనుట యీ పద్ధతిలో నిమిడియున్న దని యతడు భావించెను. కాని సదరు ధన మతిచౌకగా నున్న మార్కెటులో తీసికొనబడ లేదు. ఋణము దీర్చుటలో ఋణగ్రస్తుని (ప్రభుత్వము వారి) యిష్ట మేమియు లేదు. దానిని తీర్చక అట్లుంచుకొనుట

*1857-58 నాటివిప్లవమువలన కలిగినరాజకీయవ్యవహారపుటొత్తిడినుండి విముక్తు లగుటతోడనే గ్యారంటీ పద్ధతిలోని దూబరా ఉన్నత ప్రభుత్వాధికారులకు గోచర మయ్యెను. భారతప్రభుత్వము వారు తమ 1861 నవంబరు నాటి (No 11) డిస్పాచిలో నీవిధముగా పెంచబడుచున్న మూలధనము చాల భారముగా నుండుటచే దీనిని నిరోధింపవలసినదని యింగ్లండులోని యధికారులకు వ్రాసిరి. వైస్రాయి కౌన్సిలుకు అధ్యక్షుడైన సర్ జె. పి. గ్రాంటు గ్యారంటీ పద్ధతివలన సంభవించిన రైల్వే ద్వంద్వప్రభుత్వమును దాని యార్థిక పునాదులను అధిక్షేపించెను

వలన ప్రభుత్వమున కెంతనష్టము వచ్చినను వచ్చునుగాక! కాని ఋణదాత దాని నెప్పు డడిగినను అడుగవచ్చును; లేక దానికి సరిపడు వార్షికమును(ప్రభుత్వ మెట్టి యార్థికదుస్థితిలోనున్నను) కోరవచ్చును. వైస్రాయి కౌన్సిలుయొక్క ఆర్థిక సభ్యుడైన యస్. లెంగుగారు 1861 ఏప్రిల్‌లో వ్రాయుచు కార్యనిర్వాహకులు స్థలస్థులు కారనియు రైల్వేను ప్రారంభించునప్పటి కైన ఖర్చుల లెక్కలును రహదారీ రాకపోకలవలన వచ్చు లెక్కలును సరిగా లేవనియు, కంపెనీలవారు తమ లాభముల కొఱకు కేవలము తమ కీయబడిన పూచీనే చూచుకొనుచున్నారనియు తన యభిప్రాయము నీ పద్ధతికి వ్యతిరేకముగా వెలిబుచ్చెను. (పే 65-66, 'హిందూదేశములోని రైల్వేనీతి'నుండి సంక్షేపింపబడినది)

1884 లోని పార్లమెంటువారి సెలెక్టుకమిటీయెదుట సాక్ష్య మిచ్చుచు నీవిషయములలో మంచి యనుభవము గల సాక్షు లొకరితరువాత నొకరు పూచీపద్ధతిని ఖండించియుండిరి. 1869 లగాయితు నీ రంగములో ప్రభుత్వమువారు స్వయముగా దిగుటచే రైల్వేను ప్రారంభించుట కగు ఖర్చులను, తరువాత దానిని నడపుట కగుఖర్చులను బోల్చి చూచుటకు వీలు కలిగెను. ఇట్లుచేయుట యెంతమాత్రము ననవసరము కాజాలదు. హిందూదేశములో చాలకాలము ప్రభుత్వము తరఫున రైల్వే డైరెక్టరుగా పనిచేసిన సర్ జట్లను డాన్వర్సు పూచీపద్ధతిని విమర్శించినవారి యభిప్రాయములను బూర్తిగా నంగీకరింపలేదు. అయినను అతడుగూడ "ఇప్పుడు నిర్మింప

బడిన (ప్రభుత్వముచే స్వయముగా) రైల్వేలైనునకైన ఖర్చులు మొట్టమొదట ప్రధాన లైనులమీద నిర్మింపబడిన లైనులకైన దామాషాఖర్చులకంటె చాల తక్కువయయ్యెను. మైలునకు 18,000, లేక 20,000 పౌనులకు బదులు ఇపుడు అయిదడుగుల ఆరంగుళముల గేజిగల లైనుకు 4000 మొదలు 9000 పౌనులలో నగుచున్నది. (1872-73 నాటి హిందూదేశరైల్వే వార్షికరిపోర్టు) భారతదేశములో రైల్వేవిషయములలో మరెవ్వరికిని దీసిపోని యనుభవమును గడించిన జనరల్ స్ట్రాచీగారు గ్యారంటీపద్ధతిని స్పష్టముగా ఖండించెను.

"అది బూడిదలోబోసిన పన్నీటివలె సొమ్మును వమ్ము చేయుటేగాక హిందూదేశములో పన్ను చెల్లించు ప్రతిబక్కవేగును దోడి యేవిధమైన కష్టనిష్ఠురమును అనుభవింపని తృతీయకక్షకు జెందినవారి చేతులలోనికి పోయిన అతివిలువమైన యాస్తినొకదానిని సృష్టించెను." (1884 లోని సెలెక్టుకమిటీ వారిమెదుట వేయబడిన 19 వ ప్రశ్నకు జవాబు.)

వెస్టులెండుగారును (తరువాత హిందూదేశమునకు ఆర్థికమంత్రిగా వచ్చిరి) స్ట్రాచీగారునుకూడ పూచీగా నొసంగబడిన వడ్డీ న్యాయమైన రేటును దాటి చాలహెచ్చుగా నుండెనని స్పష్టపఱచిరి. (5297-5298 ప్రశ్నలకు జవాబు చూడుడు.) 309 వ ప్రశ్నకు స్ట్రాచీగారి జవాబుకంటె స్పష్టపఱచవలసినది మరేమియు లేదు.

ప్రశ్న:—"అప్పటి భారతప్రభుత్వమువారు యీస్టు యిండియా కంపెనీకిని యితరరైల్వేకంపెనీలకును పూచీనిచ్చిన

కాలములో దయింతట వారు మూ ద్రవ్యమును బదులు చేయజాలక పోవుట నిజమేనా ?

జవాబు:—వారు తేజాలకపోయిరేమో నాకు తెలియదు! ఎన్నడు చూచినను వారట్లు తేజాలకపోయిరనుటకు సాక్ష్య మేమియులేదు. అట్లు తేరాదని తేకుండుటే మంచి దని వారు తలంచిరి. అది కేవలము భ్రమ యనియే నా యభిప్రాయము. బహుశః, కాదు! కాదు! నిశ్చయముగా వారు కంపెనీ కంటె మంచి షరతులమీాదనే అప్పు తీసికొనగలిగియుండిరి."

1857 లోని విప్లవము నణచివేయుటకు 1857-58 లో ప్రభుత్వము వారు పెద్దపెద్ద మొత్తములను తేగలిగి రను సంగతిని మనము పైదానితో నన్వయించుకొనవచ్చును. ఏయాస్తియు లేనట్టియు, నెట్టిఫలమును బసగనట్టియు నిట్టిపనులకే వారు అప్పు తేగలిగినచో స్పష్టముగా ఫలము కాన్పించుచున్నట్టి పనులకు వారేల అప్పు తేజాలకుండిరి? దీనిభావ మేమి తిరుమలేశ ?

తొలుదొల్తనే గ్రహింపవలసిన దేమనగా గ్యారంటీడు కంపెనీలకు పూచీగా నియ్య నిర్ణయింపబడిన వడ్డీ కురదలాకుగాను చెల్లించుట ప్రారంభమైనది లగాయితు ఈ కంపెనీలు తమవడ్డీకి సరిపడునంత సంపాదింపగల తేదీ వచ్చువరకు నీ దేశాదాయమునుండి 58 కోట్ల రూపాయిలు చెల్లింపబడెను.

43. ప్రభుత్వము వారు స్వాధీనము చేసికొనుట:—కాని భారతదేశములోని రైల్వేలసందర్భములో జరుపబడిన ద్రవ్య

సంబంధమైన యన్యాయ మింతటితో నాగలేదు. కంట్రాక్టు ప్రకారము ప్రభుత్వమువారు మొట్టమొదట 25 వత్సరములు గడచినతోడనే యీ రైల్వే ఆస్తులను తీసికొనుటకు హక్కు గలిగియున్నారు. 1872 లో భారతదేశ సెక్రెటరీగారు సదరు కంట్రాక్టును రద్దుచేసి క్రొత్తయేర్పాటుల ప్రకారము మొదటి గ్యారంటీను కంపెనీలమీదనుండి యీ షరతును తొలగించి వేసిరి. చివరకీ యాస్తులను దీసికొనినపుడు భారతప్రజలపై నమితమైన క్రొత్తభారములను దెచ్చిపెట్టుషరతులంత దీసికొనిరి. కంట్రాక్టులలోని షరతులప్రకారము కంపెనీలకు వారి ఆస్తిని వశపరచుకొను నాడు బజారువిలువను బట్టి వారి వాటాలకు లేక ఆస్తికి తగినవిలువను జెల్లింపవలసియుండెను.

ప్రభుత్వమువారీ యాస్తులను వశపరచుకొందు రను సంగతి తెలియుటతోడనే (ఈ వాటాలమీద లేక ఆస్తిమీద దండిమైన గ్యారంటీనువడ్డీ వచ్చుచుండుటచే) వీటి బజారుధర యమితముగా పెరిగిపోయెను. ప్రభుత్వమువారీ యాస్తులను తీసికొనిననాడు కంపెనీల పెట్టుబడి ఆస్తిమీద చాల అదనపుసొమ్ము చెల్లింపబడెను. పెట్టుబడి ఆస్తియొక్క విలువగా నంగీకరింపబడినమూల్యమును ప్రభుత్వమువారి భాండులమూలముగా చెల్లించుటచే నీ యేర్పాటులవలన భారతప్రజపై మోపబడినభార మమితమును, అన్యాయమును అని వేరుగ జెప్ప నక్కరలేదు. ఈ భారమంతయు గలిసి మొత్తము 330 లక్షల పౌనులు లేక 50 కోట్ల

రూపాయ లయ్యెను. ప్రభుత్వము వారీ యాస్తులను దీసికొనిన తరువాత దీనిని తిరిగి కంపెనీలకు రైల్వేలను నడుపుటకు కవులున కిచ్చిరి. భారతప్రయోజనమును, జాతీయార్థికములను దృష్టియం దుంచుకొని చూతుమేని యీ క్రొత్తకంట్రాక్టులయొక్క షరతులు మరింత విషతుల్యములుగా నుండెను. ఫలిత మేనగా నింత హెచ్చుత్యాగములతో నిర్మింపబడిన ఆస్తి యేబదివత్సరములు గతించిన తరువాతగూడ భారతప్రజల కావంతయు లభింపదయ్యెను. పైగా నది క్రొత్తభారమునను మోపుటకే తోడ్పడెను.

44. రైల్వేకంట్రాక్టులలో మారకపురేటును స్థిరము చేయుట:—హిందూదేశములోని రైల్వేకంట్రాక్టులలోను, సామాన్య రైల్వేనీతిలోని మొట్టమొదటి గ్యారంటీడు కంపెనీలతో జేసికొనిన మొదటి కంట్రాక్టులలోని యొక షరతు మన మెన్నటికిని మఱువదగని విషయము. ఈ షరతు కంపెనీలకు స్థిరమైన మారకపురేటును గలిగించెను. మొట్టమొదటి కంట్రాక్టులు రూపాయికి 22 పెన్నీల చొప్పున మారకమును స్థిరపఱచెను. భారతప్రభుత్వమువారి లెక్కలనుగురించిన అప్రిప్రియేషను రిపోర్టు (1885-86, పేరా 103) ప్రకార మీవిధముగా స్థిరముచేయబడిన మారకపురేటు ఆచరణలో నీక్రింది విధముగా బరిణమించెను. గ్యారంటీడు రైల్వేకంపెనీలును, నితర రైల్వేకంపెనీలును తమ మూలధనమును మొదట నింగ్లండులో భారతసెక్రటరీగారి యొద్దీలో నుంచెదరు. దానినుండి తమ రైల్వేలైనులను

నిర్మించుకొనుటకు వారు కొంతభాగమును ఇంగ్లండులోను కొంతభాగమును హిందూదేశములోను వాడుకొనుచుందురు.

ఇంగ్లండులో ధరావతుగా నుంచబడి యింగ్లండులోనే వాడుకొనుటకు దీసికొనబడు ద్రవ్యమువిషయములో లాభనష్టములసమస్య లేనేలేదు. కాని శేషించిన మిగతధనము భారత సెక్రిటరీగారి బిల్లుల దామాషా మారకపు రేటుల ప్రకార మిం గ్లండులో దీసికొనబడి హిందూదేశములో కంపెనీలతో జేసికొనబడిన స్థిరమైన రేట్లప్రకార మిచ్చి వేయుదురు. కౌన్సిలుబిల్లులకు గల రేట్లకంటె కంట్రాక్టు రేటులే హెచ్చయినపు డీ వ్యాపారములో ప్రభుత్వము వారికే లాభ ముండును. కాని కంట్రాక్టు రేటులే తక్కు వైనపుడు ప్రభుత్వమునకు నష్టము కలుగును. రైల్వేలను నిర్మించుటకు ద్రవ్యము నింగ్లండు నుండి తెచ్చునపుడు హిందూదేశములోని కంపెనీలచే తీసికొనబడు ద్రవ్యమునుబట్టియు కౌన్సిలుబిల్లుల మారకపు రేటుల యుధఃపతనోత్పతనములను బట్టియు లాభనష్టములలోని హెచ్చుతగ్గు లేర్పడుచుండును.

తరువాత నీ కంపెనీలవలన హిందూదేశములో నగదు జమ లుండెడివి. ఇంగ్లండులో వీటికి పోటీజమలు కట్టెడి వారు. ఈ సందర్భములో వ్యవహారము తారుమారయ్యెడిది బజారు రేటుకంటె కంపెనీవారి మారకపుకంట్రాక్టు రేటు తగ్గినపుడు ప్రభుత్వమునకు నష్ట ముండెడిది. ఈనగదు జమలలో నొకటి యింగ్లండు నగదుఅక్కౌంటులోనుండి సామగ్రిని కొని హిందూదేశములో రెవిన్యూఅక్కౌంటుకు బదిలీ

యయ్యెడిది. కాని యీ బదిలీలు గత అర్ధవత్సరములో తీసి కొనబడిన కౌన్సిలుబిల్లుల దామాషా రేటుల ప్రకారము లెక్క చూచుకొనబడెడివి. కనుక దానివలన గత అర్ధవత్సరదామాషా రేటునకును సంవత్సర దామాషా రేటునకును గల తేడాల వలన నుదయించునంతటి లాభమో నష్టమో కలుగుచుండెడిది

హిందూదేశములో రైల్వేలు ప్రారంభమైన తేదీలగాయితు మొదటి యిరువది వత్సరములవరకును ఈ సమస్య అంత యెక్కుడు కఠినముగా లేదు. ఆ రోజులలో సగదు ఇంగ్లండునుండి పంపబడుచుండెడిది. కంపెనీలనుండి ముట్టిన ప్రతి పౌనుకు (రూపాయికి 22 పెన్నిల చొప్పున) రూపాయిలు ముట్టెడివి. కాని యీ మొత్తము పౌనులలోనే యుండెడిది. కనుక హిందూదేశమునుండి గ్యారంటీడు వడ్డీ అకౌంటుల పేరనున్ను, అధికలాభముల అకౌంటు పేరనున్ను సొమ్ము పంపించవలసివచ్చినపుడు మారకము హిందూదేశమునకు విషమముగా బరిణమించెను ప్రతి రూపాయికి 15 పెన్నీలు లేక యింకను తక్కువగా వచ్చుచుండెను. కనుక లాభములు, వడ్డీలపేర రైల్వేలకు దామాషాను బంపబడిన 10 లక్షల పౌనులకు, ఆ మొత్తమునకే పూర్వము 110 లక్షల రూపాయిలు చాలగా, నిపుడు 150 లక్షల రూపాయిలు కర్కవలసివచ్చెను. ఈ యకౌంటు పేర హిందూదేశము రొక్కరూపములో నెంత యదనముగా సమర్పించుకొనవలసివచ్చెనో చెప్పుట సాధ్యముకాదు. కాని యీ మొత్తము చాల హెచ్చుగా నుండకతీర దనియు నయినను

నిది దృష్టిపథములోనికి తేబడలేదనియు జెప్పుట సత్య దూరము కానేరదు. కనుక నీకారణముచే రైల్వే ఆస్తులను ఆస్తిగా బరిగణించుటకు బూర్వము సదరు ఆస్తియొక్క విలువను గొంత తగ్గించవలసియున్నది

45. రాజనీతికి చెందిన రైల్వేలు.— రైల్వేభారమును గురించిన యీ భాగమును బూర్తిగా ముగించులోపల భాగతసరిహద్దులలోని రాజనీతికి జెందిన రైల్వేలనుగురించి యుచ్చరింపవలసియున్నది. వీటిమీద భారతప్రభుత్వమువారి కిప్పటికిగూడ నొక్క పైసయైనను లాభము వచ్చుటలేదు. కొన్ని రైల్వేలను మాత్రమే 'రాజనీతికి చెందిన రైల్వేలు' అని విభజించుట పొరపాటు. అయినను విషయము నంతగా మథింపక ప్రభుత్వము వారి విభజననే యంగీకరింతము. పశ్చిమోత్తర సరిహద్దుల లోన, ఏడెనులోను నిర్మింపబడిన, రాజనీతికొఱకని యొప్పుకొనబడిన రైల్వేలకైనఖర్చు 33,38,72,000 రూపాయిలని తుదిరైల్వే పరిపాలనని వేదికలో తేల్చబడెను. ఈ రైల్వేలు మొట్టమొదటనుండియు శుద్ధదండుగవ్యాపారములు. పశ్చిమోత్తరసరిహద్దులలోని రైల్వేలలో గొంతభాగము (ఆప్రాంతములలో కాలువలు మొదలగు వానిని త్రవ్వి పట్టుభూములను పంట భూములుగా మార్చుటచే) ఈమధ్యనే లాభకరముగా బరిణమించెను. అయినను 1929-30 రైల్వేఅక్కౌంటులలో మొత్తమునష్టము 1,90,10,000 రూపాయి లని చూపబడెను. ఇవి కేవలము సైనికసంబంధమైన రైల్వేలు కనుక దేశమును ఇట్టి రైల్వేలను విలువగల (అన్నిరైల్వేలమీదను బెట్టినమూలధన

మును తెలుపుఱంకెలను బట్టినవిలువ) ఆస్తిగా దీసికొను మని చెప్పుటకు బూర్వ మిట్టి విపరీతవిషయములకు దగినవట్ట మును మనపోయింపవలసియున్నది.

ఈ రైల్వేలలో నొక్కటియైనను కేవలవర్తకప్రయోజనములకొఱకే నిర్మింపబడలేదు. హిందూదేశములోని రైల్వేయుద్యమజనకుడును, కంపెనీకి గవర్నరు జనరలును అగు డల్హౌసీప్రభువు ప్రభుత్వమువారు రైల్వేనిర్మాణమునకు దోడ్పడుటకు రాజకీయ, సైనికప్రయోజనములకే ప్రధానస్థానము నిచ్చెను. అతడీవిషయమై మర్మము లేకుండ జెప్పెను. తాను సూచించిన రైల్వేలు లాభదాయకములు గాకపోయినను కంపెనీప్రభుత్వమువారు సదరురైల్వేలను నిర్మించుటకు ప్రారంభించిన కంపెనీలకు గొంత సాయము చేయవలెనని యతడు స్పష్టముగా సలహా నిచ్చెను. నాటినుండియు భారత ప్రభుత్వమువారీ రెండుయుద్దేశములనే స్థిరముగా దమదృష్టియందుంచుకొనిరి.

రైల్వేల సందర్భములో మనకు ముదరా రావలసిన దేమి యనగా:—

| | |
|---|---|
| ప్రభుత్వమువారు రైల్వేలను తీసికొనినపుడు నూటికి 20 చొప్పున చెల్లించిన ప్రీమియము. | 50 కోట్లు |
| సరిహద్దులలో నిర్మించిన రైల్వేలకైన ఖర్చు. | 33 ,, |
| వెరశి | 83 ,, |

46. నీటిపారుదల:— నీటిపారుదల పనులకు (ఉత్పత్తి శాఖకును, రక్షణశాఖకును కలిపి) మొత్తముగా జేయబడిన ఋణము 123.02 కోట్ల రూపాయిలు. ఇదంతయు నిపు డుండక పోవచ్చును. ఈ ఋణము విషయమై భారతప్రజల కెట్టి సంశయములు నుండనక్కరలేదు. ఈ ఋణమునకుగాను భారత దేశమునకు తగినంతఆదాయము నిచ్చువసతి యేర్పడెను. కాని యీ ఋణమునకును నుత్పత్తిలక్షణములు గలవని చెప్పబడు నితరపనులకు గావింపబడిన ఋణములకును గల తారతమ్యము నించుక జూపవలసియున్నది. మొట్టమొదటియంశ మేమనగా నీటిపారుదల పనులకైన ఋణము (రెండు శాఖలకు సంబంధించిన ఋణము) దేశముయొక్క మొత్తపు సస్యసంపత్తి నభివృద్ధిచేయు విధమున నుపయోగింపబడెను. ఈ కార్యముల ఫలితముగా నీపనులకై పెట్టిన పెట్టుబడిధనముకంటె సంవత్సరమునకు 142 కోట్ల రూపాయిల విలువగల సస్య మెక్కువ పండుచున్నది. ఇంతియేగాక నీ విషయమైన అక్కౌంటులలో నవలంబింపబడిన సూత్రము లతికఠినములుగా నుండుటచే నీటి పారుదలపనులలో నెట్టిపనియు అది ప్రారంభింపబడిన తేదీలగాయితు దాని కయినఖర్చులును వడ్డీయును మొట్టమొదటి పనకోసిన పది సంవత్సరములలోనే ముట్టనిచో ఫలోత్పత్తి గల పని యని పిలువబడజాలదు. అట్టిసూత్రమువలన నీటిపారుదలకు చెందిన యన్నిసూచనలందును కఠినమైనపరీక్ష యుండుటయు దానివలన మొత్తముమీాద నాపను లంత ఫలప్రదములుగా నుండుటయు సంభవించెను.

గ్యారంటీలను పొంది తమకు పూచీగా వచ్చు లాభములనుమాత్రమే చూచుకొని వీనిని నడపుటలోగాని, నిర్మించుటలోగాని యెట్టి పొదుపును చూపనవసరము లేని వ్యక్తుల సంఘ మేదియు నీరంగములోనికి పోటీగా రాలేదు.

47. తపాల, తంతిమార్గములు:—వర్తకశాఖకు లేక ఉత్పత్తి గలదని వర్ణింపబడు నితరశాఖలకు జెందిన ఋణమంత గొప్పదికాదు. రైల్వేశాఖకు చెందినవాటివలె నీటికి చెందిన ఖర్చులలోని సూత్రములుగూడ నంత విషమమైనవి కావు. తపాల, తంతిమార్గములకు సంబంధించిన ఖర్చులు 23 కోట్లరూపాయలు. ఈ రెండుశాఖలకును జెందిన ఆస్తికూడ గొంచె మెంచుమించు దీనికి సమాన మైనదిగ నుండు నని యూహించుట యన్యాయముకాదు. కనుక నివి తమభారమును దామే మోయగలిగియున్న వని చెప్పవచ్చును.

48. రాష్ట్రిఋణములు:—నిటి పారుదలకు సంబంధించిన ఋణమును తీసివేసినతరువాత మిగిలెడి రాష్ట్రిఋణమున కుత్పత్తి చేయుశక్తి కాని విలువకాని యున్నదనుట సందేహాస్పదము. బొంబాయి అభివృద్ధిస్కీము కేవలము నిష్ఫలము. ఇట్టిదాని నెన్నడును ప్రారంభింప రాదు.

స్థానిక ప్రభుత్వములకు గల ఋణములు, పోర్టుట్రస్టులు:—పురపాలకసంఘములకు, పోర్టుట్రస్టులకు, అభివృద్ధి ట్రస్టులకును రాష్ట్రిములద్వారమున నున్న యిట్టి యితరఅర్థ ప్రభుత్వసంఘములకును ఋణములుగా నిచ్చిన మొత్తము

లన్నియు నుత్పత్తిగల కార్యములకు వినియోగింపబడలేదు. స్థానిక స్వపరిపాలక సంస్థలయొక్క మొత్తపు ఆయవ్యయ పట్టికలో నీఋణముల కార్జనశక్తి కలదనికాని, తమ భారము దాము మోయకలవనికాని చూపబడలేదు. ఈ ఋణభార మెట్లో వహింపబడుచున్నది. కాని యీశక్తి పన్నువేయుటకు వీటికి గల యధికారమువలన వచ్చుచున్నదేకాని వీటివలన సృష్టింపబడిన ఆస్తియొక్క ఆర్జనశక్తి యెంతమాత్రమును గాదు.

భారతప్రభుత్వము ఢిల్లీలో నొక నూతన రాజధానిని నిర్మించుటకు క్రొత్తగా చేసినఋణము యధార్థముగా నుత్పత్తి లక్షణము గలదని చెప్పుటకు వీలులేదు. దానిమీద ఖర్చుపెట్టిన 14 కోట్లరూపాయిలు బూడిదలో పోసిన పన్నీరుచందమయ్యెను. ఈ యాస్తి ఋణమును మోయు ఆస్తికాదు. అయినను నీద్రవ్య మంత పెద్దమొత్తము కాకపోవుటచేతను, నూతనరాజధాని కార్థికవిలువ లేకపోయినను రాజకీయవిలువ యుండవచ్చును గనుక భారతప్రజలపై నీఋణమును బూర్తిగా తొలగింపవలసిన దని మన మంతగా పట్టుపట్ట నక్కరలేదు. భారతదేశముయొక్క మిగిలిన "యుత్పత్తిగల" ఋణములు అనగా భారత సంస్థానములకును లేక స్థానికసంస్థలకును పెట్టిన పెట్టుబడి యంతకును వెనుక నుత్పత్తిగల లేక యార్జించుశక్తిగల ఆస్తి యేమియును లేదు.

50. సారాంశము:—భారతదేశముయొక్క "ఉత్పత్తి గల" ఋణ మని చెప్పబడు దానిని బరీక్షించుటవలన తేలిన సారాంశ మేమనగా:—

(a) ఉత్పత్తి లక్షణములు గల వని చెప్పబడిన నయిదారు అయిటములలోను రెండుమాత్రమే అనగా రైల్వేలు నీటిపారుదలపనులు మాత్రమే యథార్థముగా నీ తరగతికిందకు రాదగినవి.

(b) రైల్వేలయొక్క ఉత్పత్తిశక్తియు భారతదేశార్థి కాభివృద్ధికి వీటివలన గలిగిన సాహాయ్యమును నీటిపారుదల పనులతో నెట్టి సామ్యమును బొంద నేరవు.

(c) పైని వివరించిన విధమున రైల్వేలమూలమున నయిన మొత్తపు ఖర్చులలో నధమము 83 కోట్లయినను మనకు తిరిగి ముదరా రావలసియున్నది. ఇది జరిగిననేగాని భారతప్రజ లీ రైల్వేఋణముల నంగీకరింపజాలరు. యథార్థమైన వర్తక లెక్కలను, కఠినమైన న్యాయమును పాటింతుమేని మనకు రావలసినముదరా అధమపక్షము 83 కోట్లకు రెట్టింపు అగును.

(d) నీటిపారుదలకును తదితర వర్తక శాఖలకును జెందిన ఋణమునకు తగినంత యార్జన నిచ్చునట్టియాస్తి కలదు.

(e) రాష్ట్రప్రభుత్వములనుండియు, స్థానిక స్వపరిపాలక సంస్థలనుండియు లేక భారతసంస్థానములనుండియు రా

వలసిన ఋణముయొక్క "ఉత్పత్తి" లక్షణము లతిసం దేహాస్పదములు ఈ ఋణములను వహించుట కున్న యాధార మా యా ప్రాంతములలో నున్న ప్రజలయొక్కవన్ను చెల్లింపగల శక్తియొక్కటిమాత్రమే యని గ్రహింపదగును.

(f) ఒకవేళ వీనివిషయమై పూర్తియైన బాధ్యతను వహింపనెంచినను బొంబాయి యభివృద్ధిఋణము 15 కోట్లు (ఆ ప్రజలు వలదని ఘోషించుచున్నను చేయబడుట చేతను దానివెనుక నార్జించునట్టిశక్తి గల ఆస్తి బహుస్వల్పముగా నుండుటచేతను) ముదరా రావలెను.

---

# అయిదవ భాగము.

## 51 ముదరాలయొక్క సంగ్రహము:—

వెనకటి పేరాలలో నుపపాదింపబడిన వివిధ ముదరాలను యీక్రింద పొందుపఱచుచున్నాము.

| సంవత్సరము | ముదరావిషయము | పేజి. | కోట్లు | మొత్తము. |
|---|---|---|---|---|
| 1857 కు పూర్వము. | కంపెనీయొక్క బాహ్యయుద్ధము | 17 | 35.000 | |
| | కంపెనీయొక్క పెట్టుబడి ఆస్తి మీద చెల్లింపబడినవడ్డీ 1853-57 | 13 | 15.120 | 50.120 |
| 1857 | విప్లవమునకైన ఖర్చు | 17 | | 40.000 |
| 1874 | కంపెనీయొక్క పెట్టుబడి ఆస్తి మీద చెల్లింపబడినవడ్డీ 1857-74 | 13 | 10.080 | |
| | ఈస్టుయిండియాకంపెనీయొక్క పెట్టుబడి ఆస్తి విడుదలకు | 13 | 12.000 | 22.080 |
| 1857-1900 | బాహ్యయుద్ధములు | 21 | 37.500 | |
| 1914-1920 | ఐరోపాయుద్ధవిరాళము | 30 | 189 000 | |
| | ఖర్చు | 33 | 170 700 | 397.200 |
| 1857-1931 | బర్మానుగురించిన చిల్లర ఖర్చులు | 36/42 | 20 000 | |
| | | 42 | 82 000 | 102.000 |
| 1916-21 | రివర్సు కౌన్సిల్సుమీద నష్టము | 46 | | 35 000 |
| రైల్వేలను తీసికొనినపుడు ప్రభుత్వమువారు కంపెనీల కిచ్చిన ప్రీమియము | | 57 | | 50.000 |
| రాజనీతికి సంబంధించిన రైల్వేలు | | 57 | | 33 000 |

మొత్తము ముదరా (కోట్లు) రూ 729.400

మేము తీసికొనిన యంకెలలోని పౌను లన్నింటిని రూపాయికి 24 పెన్నీలచొప్పున రూపాయిలలోనికి మార్చితిమి. యుద్ధవిరాళములు, రైల్వేకంపెనీల కిచ్చిన ప్రీమియములు మాత్రము రూపాయికి 16 పెన్నీల చొప్పున మార్చబడెను. పై మొత్తములమీద వడ్డీ యిచ్చుట జేర్చబడలేదు. (2 వ నోటులోని "ముదరాలమీద వడ్డీలు" చూడుడు.)

52. శిఫారసులు :— ఈస్టుయిండియా కంపెనీవారు రాజకీయాధికారమును సంపాదించిన తరువాత బ్రిటీషువారి హిందూదేశాక్రమణచరిత్ర యంతయు గ్రేటుబ్రిటనుయొక్క దినదినప్రవర్ధమాన మగు నైశ్వర్య, గౌరవప్రతిష్ఠల యభివృద్ధిచరిత్రయే యని గుర్తింపవలెను. ఇక హిందూదేశమునకు పట్టిన యైశ్వర్య మేమనగా భారతపరిశ్రమ లన్నియు నాశము గావింపబడెను. లేదా యణచివేయబడెను.

భారతపుణ్యభూమి గ్రేటుబ్రిటనుయొక్క యంత్రప్రసాదితవస్తువులను తదితరవస్తువులను కొను పణ్యభూమిగా మార్చబడెను. బ్రిటను యీ పణ్యభూమినిగాని, భారతదేశము యొక్క యైశ్వర్యమునుగాని తన పారిశ్రామికాభివృద్ధికి వినియోగించుకొనియుండనిచో దానిప్రస్తుతస్థితి యిప్పటివలె నెన్నటికిని నుండజాలదు. ఇంతియేగాక హిందూదేశ మనేక వేలమంది బ్రిటీషుప్రజలకు సివిలు, మిలిటరీ శాఖలకు జెందిన యన్నితరగతుల యుద్యోగములకు నాటపట్టయ్యెను. వారి కీయబడిన జీతములును, బత్తెములును, పింఛనులును మొత్తము జేయబడినచో నదియే చాల గొప్ప మొత్తమగును.

బ్రిటనుయొక్క ప్రత్యేక మైశ్వర్యాభివృద్ధియే గాక అది ప్రపంచములో నొక గొప్పజాతి యగుటకు గూడ భారత దేశమే ప్రధానకారణము. ప్రస్తుత మున్న ఋణము లన్నింటిని భారతదేశమునుండి యాంగ్లదేశముమీదకు (నైతిక, న్యాయదృక్పథములనుండి చూచితిమేని) మార్చుట కీ విషయములే చాలును.

ఈ సందర్భములో నింగ్లండునకును ఐరిషు స్వేచ్ఛా ప్రభుత్వమునకును మధ్య జరిగిన వ్యవహారముల నొకింత నిరీక్షించుట యవసరము.

ఐరిషు స్వేచ్ఛాప్రభుత్వము నిర్మింపబడువరకును ఐర్లండు సంయుక్తరాజ్యములో (United Kingdom) నొక భాగముగా నుండెను. కనుక నింగ్లండు, స్కాట్లండు, వేల్సు లతోబాటు అదియు బ్రిటిషు జాతీయఋణములకు సహజముగా బాధ్యతను వహింపవలసియే యున్నది. ఐరిషు స్వేచ్ఛా ప్రభుత్వము నిర్మింపబడిననాడు ఆ తేదీకిగల జాతీయఋణము **77,210** లక్షుల పౌనులలోన నైర్లండున కెంత పంచిపెట్టవలెనను సమస్య సహజముగా బుట్టెను. ఐర్లండు ఆక్టుయొక్క అయిదవ నిబంధనప్రకార మది యీ క్రింది విధముగా బరిష్కరింపబడెను.

"ఐరిషు స్వేచ్ఛాప్రభుత్వమువారు సంయుక్త రాజ్యమున కా తేదీవరకు గల ఋణములోని, ఆ తేదీ కమలులోనుండి చెల్లింపబడుచున్న యుద్ధపించనులలోను న్యాయమును సరసమును నగు భాగమును బంచుకొనవలెను. ఐర్లండునకు రావల

సిన ముదరాలనుగూడ న్యాయముగను, సరసముగను, నుండు లాగున కట్టుకొనవలెను. ఈ యంశెలను పరస్పరాంగీకార ముతో గుదుర్చుకొనలేకపోయినచో బ్రిటిషుసామ్రాజ్యము లోని యొకరుగాని యెక్కువమందిగాని మధ్యవర్తులద్వారా పరిష్కరించుకొన నిర్ణయము.'' పై నిబంధనలోని షరతుల ప్రకారము ఐర్లండు, ఇంగ్లండుల మధ్య జరిగిన చిరకాల యుద్ధములో నైర్లండు గొల్లకొట్టబడెను, నాశము గావింప బడెను. దీనికై ఐర్లండు ముదరాకోరుట ధర్మము. అప్పుడు 1925 వ నాటి ఐర్లండుఆక్టు పుట్టెను. అందులో నీక్రింది యేర్పాటులు గావింపబడెను.

"అగ్రిమెంటులోని యయిదవ ఆర్టికిలు ప్రకారము చెల్లించుకొనవలసిన ఋణములనుండి ఐరిషు స్వేచ్ఛాప్రభుత్వ మువా రిపుడు విముక్తు లగుచున్నారు "

పై ఆక్టువలన ఐర్లండునకు సంబంధించినంతవరకీ రెండు దేశముల మధ్య జరిగిన గొప్ప పోరాటమునకైన ఖర్చుల నన్నింటిని యింగ్లండు భరించుటయేగాక జాతీయఋణములో నైర్లండుభాగమునకు వచ్చు ఋణమునుగూడ నింగ్లండే భరించెను. అదే విధముగా తననుగూడ జూడవలెననియే భారత దేశ మిపుడు ఇంగ్లండును గోరుచున్నది.

ఐర్లండు ఇంగ్లండులమధ్య జరిగినయుద్ధము చాల కాలము పట్టెను. దీనికపరిమితమైన ఖర్చులు, చార్జీలు, వ్యయములు వగైరా లయ్యెను. ఈ ఖర్చులో గొంతవరకు సాంవత్సరిక ఆదాయములనుండి చెల్లింపబడెను. దీనివలన జాతీయ

ఋణము కొంతవరకు పెరిగియుండవలెను. దీనినిబట్టి మనము తీయవలసిన నీతి స్పష్టముగనే యున్నది. హిందూదేశము జాతీయ స్వపరిపాలన మను నూతనయుగముతో ప్రారంభము గావలె నన్న, యథార్థమైన యభివృద్ధి కొంతమైనను జరుగవలె నన్న నది స్వేచ్ఛగా నెట్టి ఋణభారమును లేకుండ నుండవలె ననియే ప్రతిన్యాయసూత్రమును శాసించుచున్నది. హిందూదేశ మెట్టి యధికపన్నులను భరింపజాలదు కనుక హిందూదేశ మభివృద్ధి యగుటకు గల కొలదియవకాశము లేవి యన:— జాతీయఆదాయములను జాతీయపనులకే వినియోగించుట. దేశమున కవసర మైనంతవరకే సైనిక, న్యాయపరిపాలకశాఖల కగు జాతీయవ్యయమును తగ్గించుకొనుట. తన ప్రయోజనములకొఱకు చేయబడని "జాతీయ" ఋణముల నుండి తప్పించినపుడు కొంతఆదాయము మిగులును. దానితో విద్య, పారిశుద్ధ్యము, జాతి నుజ్జీవింపజేయు నెన్నియో యితర సాధనములను పెంపొందించుకొనవచ్చును. భారతదేశాదాయములో చాలభాగము సైనికవ్యయముననే ఖర్చుపెట్టబడుచున్నదను సంగతి జగద్విదితము. మొత్తపు వ్యయములో దీనికి చేయబడుచున్న వ్యయప్రమాణమును జూచితిమేని ప్రపంచములో భారతదేశమే యగ్రస్థానమును వహించియున్నది.

సామ్రాజ్యప్రయోజనములకొఱకు జాతిని నిర్మించునట్టి ప్రభుత్వశాఖలను మాడ్చి సైన్యములకొఱ కమితమైన వ్యయములను చేసి దేశమునకు ఘోరమైననష్టమును గల్పించిరి.

హిందూదేశములో పోషింపబడిన సైన్యము కేవలము రక్షణ కొఱకే పోషింపబడిన దని చెప్పుటకు వీలులేదు. చాలవరకది దేశాక్రమణకొఱకుంచబడిన సైన్యము. సేలిస్బరీగారి వాక్యములలో నది భారతసరిహద్దులను దాటిన బ్రిటిషుసామ్రాజ్య ప్రయోజనముల కొఱకు సైనికాగారముగా నుపయోగింపబడెను. భారతదేశముయొక్క సామాన్య సైనికఖర్చుగా పరిగణింపబడు దానిలో నొకభాగమును గ్రేటుబ్రిటను వహింపవలె ననియు, ప్రస్తుతరాయబారములలో భారతఋణ పరిష్కారమున కిది న్యాయమైన త్రోవ యనియు సూచించుటలో తప్పిద మింతమాత్రమును లేదు

53. దీనిని సమాప్తము చేయులోపల మా విచారణలన్నింటిలోను మా కెంతయో తోడ్పడిన జి. యస్. జోషిగారికి, మా కృతజ్ఞతావందనముల నర్పించుచున్నాము. ఈ విషయమునుగురించి తమ యభిప్రాయములను వాఙ్మూలములుగా సమర్పించిన యితరవ్యక్తులకును సంఘములకును కూడ మా వందనముల నర్పించుచున్నాము.

డి. యన్. బహాదూర్జీ.

కుషాల్ టి. షా.

భూలభాయి జె. దేశాయి.

జె. సి. కుమారప్ప,

సమావేశకర్త.

(1, 2 నోటులు చూడుడు.)

## నోటు (1)

మే మందరమును గలిసి యేకగ్రీవముగా చేసిన మా నివేదికలోని ముదరాలనుగాక నేను కార్యనిర్వాహకకమిటీ వారికి వార్షికసైనికవ్యయములపై నీక్రింది నోటును సమర్పింప గోరుచున్నాను. వార్షిక సైనికవ్యయము:—మన ఆదాయములోని మెట్టు భాగము ప్రభుత్వముయొక్క ప్రాథమిక విధులకు ఖర్చుపెట్టబడుచున్నదను సంగతి జగద్విదితము. "అంతర్జాతీయ వ్యవహారములతణిఖీ"ని యె. జె. టో. యన్ బి. 1929 సంవత్సరములో చేసెను. అతడు 41 దేశముల సైనికవ్యయములను బరీక్షింపగా భారతదేశము తన మొత్తము వ్యయములో నూటికి 45.29 సైన్యముకు వెచ్చించుచు నగ్రస్థానమును వహించుచున్నది. ప్రపంచములోని ప్రధాన సైనికదేశములను తీసికొని వాటిమొత్తపు ఖర్చులలో సైనిక ఖర్చుల కగు వ్యయములనుబట్టి స్థానముల నిచ్చితిమి.

| స్థానము. | దేశము. | వ్యయము : నూటికి వంతులు. |
|---|---|---|
| అగ్రస్థానము | భారతదేశము | 45.29 |
| అయిదవస్థానము | జపాను | 26.57 |
| తొమ్మిదవ స్థానము | ఇటలీ | 23.46 |
| పదునాల్గవస్థానము | ఫ్రాన్సు | 19.75 |
| ఇరువదియైదవ స్థానము | అమెరికా | 16.09 |
| ముప్పదియవ స్థానము | గ్రేటుబ్రిటను | 14.75 |
| ముప్పదియేడవస్థానము | జర్మనీ | 7.16 |

గ్రేటుబ్రిటను సైన్యమునకు వెచ్చించు దానికంటె హిందూదేశము మూడురెట్లుకంటె నెక్కుడుగా కూడ సైన్యమునకు వెచ్చించుచున్నది. సైనికవ్యయముకొఱకు జాతి నుజ్జీవింపజేయువ్యయములను మాడ్చుటవలన దేశమునకు సంభవించు నష్టమునుగురించి చర్చించుట కిది స్థలము కాదు. కాని 1857 లగాయితు భారతదేశములో నున్న సైన్యము కేవల మాక్రమణకొఱ కేర్పరుపబడిన సైన్యమువంటి దని చెప్పక తప్పదు. ఆ తేదీ లగాయతు బ్రిటీషు ఆక్రమణ భద్రముగా నుండునట్లు భీమాచేసికొనుటకు గాను ఒక తెల్లవాని కయిదుగురు భారతసైనికు లుండుస్థితినుండి ప్రస్తుతస్థితికి అనగా నొక తెల్లవాని కిద్దరు భారతసైనికు లుండుస్థితిని తీసికొనివచ్చిరి.

భారతసైన్యసంఖ్య సామ్రాజ్యావసరముల కొఱకే యమితవ్యయముతో బోషింపబడుచుండె ననుటకు భారతసరిహద్దులను దాటిన సామ్రాజ్యయుద్ధములకొఱకా సైన్య మెప్పుడవసరమైన నపు డావంతయు సందేహింపక, దాని స్థానే భారతదేశములో నెట్టి సైన్యము నైన నుంచుటకు బ్రయత్నింపనైనను బ్రయత్నింపక నెంతకాల మవసరమైన నంతకాలము స్వేచ్ఛగా నుపయోగించుకొనుచుండుటకంటె ప్రబలనిదర్శనమేమియు నవసరము లేదు.

ఈ విధముగా భారతదేశము బ్రిటిషు సామ్రాజ్యావసరములకు "ప్రాచ్యతీరములందు సైనికాగారము" గా నుపయోగింపబడెను. భారతసైనికుని వ్యయముకంటె నాంగ్ల

సైనికునికి మూడు మొదలు నాలుగు రెట్లవరకు వ్యయ మధిక
మగుచుండుటచే భారతప్రభుత్వమువారి సైనికవ్యయము (అది
కేవలము రక్షణకొఱకును, కేవల భారతసైనికులతోడను
నుండుచో నగుదానికంటె) చాల యధిక మగుచుండెను.
కనుక భారతదేశావసరములకు కావలసినవ్యయముకంటె నధిక
వ్యయమును దెలుపు మొత్తమును న్యాయముగా గ్రేటుబ్రిటను
భరించుట విధి యైయున్నది.

ఇంతేకాక సామ్రాజ్యకారణములచే కేవలము స్థాని
కావసరములకు గావలసిన యుద్ధసామగ్రి మొదలగు సంభా
రములకంటె నెక్కుడు ప్రమాణము నుంచిరి. వెల్బికమిషను
సభ్యుడైన బుకనను కమిషను రిపోర్టులోని తన నాల్గవ రిజర్వే
షనులో నిట్లు చెప్పెను.

"భారతదేశముయొక్క సైనికరక్షణకు సంబంధించి
నంతవఱకు భారతదేశమే ప్రతిపైసయు చెల్లించుచున్నదనియు
నాంగ్లదేశము చిల్లిగవ్వయైనను భరించుటలేదనియు నిదివరకే
సూచింపబడెను. అయినను భారతదేశముయొక్క సైనిక
రక్షణము సామ్రాజ్యసమస్యలలో నొక గొప్పసమస్య.

ప్రాచ్యఖండములో మనసామ్రాజ్యబలమునకు భారత
సైనికబలమే ప్రధానకారణము. ఆ బలముచేతనే గ్రేటుబ్రిటను
ఆశియాఖండములో నొకగొప్ప ప్రభుత్వము కాగలిగెను. దక్షి
ణాఫ్రికా యుద్ధములో బ్రత్యక్షముగను నప్రత్యక్షముగను
మనకు భారతదేశము చేయుచున్నసహాయము సామ్రాజ్య
మునకు భారతసైన్యముయొక్క విలువను చెప్పకయే చెప్పు

చున్నది. భారతదేశమునుండి నేటాలుకు మంచివిషమసమయములో 6000 మంది బ్రిటిషుసైనికులు పరిపూర్ణమైన యుద్ధసంభారములతో తుత్రిటికాలములో బంపబడిరి. ఇతరులు వారి ననుసరించిరి. ఇప్పుడు యుద్ధకార్యములకొఱకు బ్రిటిషు సైనికులు బంపివేయబడుటచే భారతదేశీయ సైనికులే మారిషసు, సింహళము, సింగపూరు మొదలగు నితరప్రదేశములను గాపాడుచున్నారు.

కనుక సామాన్యకారణములచేతను సామ్రాజ్యమునకు భారతసైన్యము చేయగల యనన్యసాహాయ్యమును మనము కండ్లార మొన్ననే చూచుటచేతను భారతబలమే సామ్రాజ్యబలమనియు, నీ సామ్రాజ్యవిధులను నెరవేర్చుటచేత నీ భారములో కొంత సామ్రాజ్య బొక్కసమునుండి భరింపవలెనని భారతదేశము కోరుటలో న్యాయమున్నదనియు నిస్సంశయముగ రుజువయ్యెను. ఆ మొత్త మెంత? దాని నేవిధముగ బరిష్కరింపవలెను? అను విషయములో కష్టము లుండిన నుండవచ్చును. కాని భారతదేశమునకు రావలసిన మొదరా విషయమై యెట్టి ధర్మసందేహమునకును తావు లేదు."

(భారతవ్యయమును గురించిన కమిషను, 1895: Vol. IV - పే 149)

1885 పేరా 36-వ ఆర్థిక స్టేటుమెంటులో నప్పటి ఆర్థికమంత్రియైన సర్ ఆక్లండు కాల్విను గారు యుద్ధఖర్చులుగాక కేవలము సైన్యములకైన ఖర్చు 150 లక్షల పౌనులు లేక మారకముతో సంబంధము లేకుండ 15 కోట్ల రూపాయిలని అంచనా వేసెను. "ఈ మొత్తము ఇంగ్లండులోను

హిందూదేశములోను నయిన మామూలు సైనికవ్యయ ముగా పరిగణింపదగు" నని యతడు చెప్పెను. భారతప్రభుత్వ సైనికవ్యయమున కిది యొక ప్రమాణము నిచ్చుచున్నది. ధరల హెచ్చుతగ్గులను బట్టి దీనిలో తగిన మార్పులను జేసికొన వచ్చును. 1873-వ సంవత్సరమును ప్రాతిపదికగా దీసికొందు మేని 1900 వరకును ధరలలో హెచ్చుతగ్గు లంతగా లేవు. 1910-కి ఆ సంఖ్య 122, 1915 కు 152, ఇపుడు సుమారు 200 అయ్యెను. కనుక నీ హెచ్చుదల కంగీకరించి పై నుదహరింపబడిన కలముల క్రిందిప్రమాణముల నుపయోగింప వచ్చును.

1859/60—1900 ప్రమాణము 15 కోట్లు సం॥ రమునకు
1900—1915 నూటికి 33½ హెచ్చు 20 ,,
1915—1931 నూటికి నూరు హెచ్చు 30 ,,

ఒక ప్రమాణమునకు త్రోవచూపుచున్న యీ పద్ధతి (ఎంత అసంతృప్తికరముగా నున్నను) నిజముగా సైనిక వ్యయములకు జరిగిన యంకెలకు సమీపములో నుండుటచే యథార్థముల కంతదూర మగుట లేదనుసంగతి స్పష్టపడు చున్నది. 1875 లో జరిగిన వ్యయము 14.66 కోట్లు, పైన చూపబడిన ప్రమాణము 15 కోట్లు. అట్లే 1915 లో జరిగిన వ్యయము 30.80 కోట్లు, ప్రమాణము 30 కోట్లు. ఈ ప్రమాణ ములుకూడ చాల హెచ్చుగా నున్నవని చూపగలిగినను వాదముకొఱకు వీని నంగీకరించుచో నీకాలమున కంతకు నయిన ఖర్చులయొక్క ప్రమాణ మీ విధముగా నుండును.

## ప్రమాణ సైనికవ్యయము.

| | | | | |
|---|---|---|---|---|
| 1859-60—1899-1900 సం॥ | 15 కోట్లు | 40 × 15...600 | మొత్తము | |
| 1900-01—1914-15 ,, | 20 ,, | 20 × 15...300 | | |
| 1915-16—1930-31 ,, | 30 ,, | 16 × 30...480 | 1380 | |

| | |
|---|---|
| 1859 లగాయితు 1930 వరకు గల కాలములో చేయబడిన మొత్తము ఖర్చు | 2128.33 |
| పై నుదహరింపబడిన ప్రమాణమును తీసివేసినచో | 1380.00 |
| మిగిలినది | 748 33 |

| | | |
|---|---|---|
| 1860-1900 ల లోని యుద్ధములకు ప్రత్యేకముగా కోరతగిన అయిటములను తీసివేయగా | 37.5 (పేరా16) | |
| ఐరోపా యుద్ధమునకు | 170.7 ,, | 208 20 |
| భారతసైన్యమును సామ్రాజ్య ప్రయోజనముల కొఱకుంచుటచే నైన అధిక సైనికవ్యయము. దీనిని గ్రేట్బ్రిటను భరింపవలెను. | | కోట్లు 540 13 |

జె. సి. కుమారప్ప.

## వార్షిక సైనికవ్యయము.

1 వ నోటులో నుదహరింపబడిన జాబితావివరములు.

1859-60—1920-21 వరకు గల యంకెలు కె. టి. షాగారి "అరువది వత్సరముల భారత ఆర్థికములు" అను గ్రంథమునుండి సేకరింపబడెను. ఇవికూడ ప్రభుత్వస్టేటుమెంటులనుండియే తీయబడెను. 1921-22 మొదలు 1928-29 వరకుగల యంకెలు ప్రభుత్వలెక్కలనుండియు (Statistical abstracts) చివర రెండువత్సరములవియు 1931 ఏప్రిల్ 11 వ తేదీ యిండియా గెజెట్టునుండియు తీయబడెను. ఈ మొత్తములు కోట్లలో నున్నవి.

| సంవత్సరము. | కోట్లు | | సంవత్సరము. | కోట్లు | |
|---|---|---|---|---|---|
| 1859-60 | 19.38 | 19.38 | 1880-81 | 27.59 | |
| 1860-61 | 16.47 | | 1881-82 | 16.96 | |
| 1861-62 | 13.25 | | 1882-83 | 18.80 | |
| 1862-63 | 12.52 | | 1884-85 | 17.36 | |
| 1863-64 | 12.21 | | 1885-86 | 20 09 | |
| 1864-65 | 12.71 | | 1886-87 | 20.21 | |
| 1865-66 | 13.53 | | 1887-88 | 21.12 | |
| 1866-67 | 12.08 | | 1888-89 | 21.12 | |
| 1867-68 | 12.33 | | 1889-90 | 21.56 | 202.08 |
| 1868-69 | 15.58 | | 1890-91 | 21.61 | |
| 1869-70 | 16.20 | 136.88 | 1891-92 | 24.54 | |
| 1870-71 | 15.54 | | 1892-93 | 23.98 | |
| 1871-72 | 15 11 | | 1893-94 | 24 32 | |
| 1872-73 | 14 64 | | 1894-95 | 25 73 | 120.18 |
| 1873-74 | 14.45 | | 1895-96 | 25.39 | |
| 1874-75 | 13.69 | | 1896-97 | 24.56 | |
| 1875-76 | 14.66 | | 1897-98 | 27.03 | |
| 1876-77 | 15.32 | | 1898-99 | 24.31 | |
| 1877-78 | 17.72 | | 1899-1900 | 23.07 | 124-36 |
| 1878-79 | 18.32 | | 1900-01 | 23 21 | |
| 1879-80 | 22.29 | 161.74 | 1901-02 | 24.24 | |

| సంవత్సరము. | కోట్లు | | సంవత్సరము. | కోట్లు | |
|---|---|---|---|---|---|
| 1902-03 | 26.45 | | 1917-18 | 43.56 | |
| 1903-04 | 27.21 | | 1918-19 | 66.72 | |
| 1904-05 | 31.04 | | 1919-20 | 86.97 | 419.32 |
| 1905-06 | 29.51 | | 1920-21 | 87.38 | |
| 1906-07 | 30.25 | | 1921-22 | 69.81 | |
| 1907-08 | 28.87 | | 1922-23 | 65 26 | |
| 1908-09 | 29.40 | | 1923-24 | 56 22 | |
| 1999-10 | 28.66 | 278.84 | 1924-25 | 55.63 | |
| 1910-11 | 29 89 | | 1925-26 | 55.99 | |
| 1911-12 | 29.33 | | 1926-27 | 55.97 | |
| 1912-13 | 29.34 | | 1927-28 | 54.79 | |
| 1913-14 | 29 84 | | 1928-29 | 55.10 | |
| 1914-15 | 30 80 | | 1929-30 | 55.10 | 611.25 |
| 1915-16 | 33.39 | | 1930-31 | | 54.30 |
| 1916-17 | 37.48 | | మొత్తముకోట్లు రూ | | 2128.33 |

2 వ నోటు.

మే మందరమును గలిసి యేకగ్రీవముగా జేసిన మా నివేదికలోని ముదరాలుగాక పైముదరాలమీద రావలసిన వడ్డీని గురించి యీ క్రిందినోటును కార్యనిర్వాహక కమిటీవారి యామోదముకొఱకు సమర్పించుకొనుచున్నాము.

ముదరాలమీద వడ్డీలు:—మా నివేదికలో నధిక్షేపింపబడిన 'ఉత్పత్తి' లేక 'ఫలము'లేని వ్యయములకు జెందిన

అయిటములకై చేయబడి వడ్డిని భరించుచున్న ఋణముల సందర్భములో నొక అయిటము ఖర్చువ్రాయుటలో తప్పుగా వ్రాయబడినపుడు దానికై చెల్లింపబడిన వడ్డీనిగూడ ముదరా చెప్పవలసియుండు నని వ్యవహార ధర్మమునకుజెందిన సూత్రము లన్నియు శాసించుచున్నవి. భారతదేశముపై చేయబడిన అసలుఋణమే తప్పని రుజువైనపు డిట్టి ఋణమునకై చెల్లింపబడిన ప్రతిపైసను ముదరాకోరుట న్యాయమే యగును. ఈ వడ్డీలను ముదరా కోరుటలో నప్రత్యక్షముగా జరిగిన నష్టమునకుగాక ప్రత్యక్షముగా తటస్థించిన నష్టముకే ముదరా కోరబడుచున్నదను సంగతి జ్ఞప్తియం దుంచుకొనవలెను. ఇట్టి సందర్భములో వడ్డీకిగాను చెల్లింపబడిన సొమ్ములే అసలుసొమ్ము లగుచుండును. ఇది తప్పుగా చెల్లింపబడుటచే వీటికి ముదరా రావలెను.

అసలు ఋణము దానిని యథార్థముగా భరింపవలసినవారిమీదనే మోపబడినచో నీ వడ్డీ లన్నియు బ్రిటీషు బొక్కసముమీదనే పడియుండెడివి. బ్రిటీషు ఖజానా యీ భారమును దప్పించుకొనెను. ప్రతిపదికలో దీని నంతను భరింపవలసిన పార్టీయే యిపుడు దీనిని చెల్లించుకొనవలసియున్నదని యీ ముదరా కోరుచున్నది. యథార్థమైన వర్తక ధర్మము కేవలము వడ్డీని మాత్రమే గాక దానికి వడ్డీని అనగా కాంపౌండు వడ్డీని గూడ చెల్లింప నవకాశము నిచ్చుచున్నది. కాని యిపుడు కోరబడు ముదరా కేవలము భారతఖజానానుండి చెల్లింపబడిన రొక్కనగదు మాత్రమే.

ఈ వడ్డీలు సాలీనా చెల్లింపబడెను. కనుక 70 సంవత్సరముల మీాద రావలసిన ముదరాలు అసలునకు మూడురెట్ల కంటె నెక్కువ యగుచున్నవి. ఈ యసలే యన్యాయమని బ్రిటీషు ప్రముఖులే కొందరు పోరుచున్నను వారి కవడ్డీలు పట్టుదలతో చెల్లింపబడుటచే వీనికై వగచిన లాభము లేదు. వెల్బీకమీా షను యెదుట గోఖేలుగారీ సంచితమైన ముదరాలను కోరగా నది యధిక్షేపింపబడెను. అపుడు గోఖేలుగారిట్లు జవాబు చెప్పిరి.

"ఒక భారమన్యాయమని తలంచు జనులు దానిని సహజముగా నట్లే పరిగణింతురు."

కాలమునుబట్టి ప్రభుత్వఋణములమీాద వడ్డీ మాటి మాటికి నూటికి 3½ లగాయతు 7 వరకు మారుచుండెను. కనుక మనము ముదరా కోరవలసిన వడ్డీరేటును నిర్ణయిం చుట చాల కష్టము. అన్ని ప్రభుత్వఋణముల మీాదను దామాషావడ్డీ నూటికి నాలుగుచొప్పున నగును. కనుక పై అయిటముల విషయములో గ్రేటుబ్రిటను మీాద నూటికి 4 చొప్పున సరళవడ్డీ కట్టుటలో నన్యాయ మెంతమాత్ర మును లేదు. 4-వ నెంబరు అయిటమునకు దప్ప యీాక్రింది అయిటములమీాద నీ భారములు వేయబడిన తేదీలగాయతు పై రేటుచొప్పుననే వడ్డీ కట్టబడెను. 4-వ నెంబరు అయిటము మీాద 37.5 కోట్ల మొత్తము ఋణములోను చాల భాగము 1878-86 మధ్య చేయబడెను. కనుక 1880 లగాయతు వడ్డీ కట్టబడెను.

| | కోట్లు | | వడ్డీ. కోట్లు |
|---|---|---|---|
| 1. ఈస్టుఇండియాకంపెనీయుద్ధములు | 35 | 1857-1931 | 103.60 |
| 2. "విప్లవ" ఖర్చులు | 40 | 1860-1931 | 113 60 |
| 3. కంపెనీ మూలధనము, వడ్డీ | 37 | 1874-1931 | 84 36 |
| 4. 1857 తరువాత బాహ్యయుద్ధములు | 37.5 | 1880-1931 | 76.50 |
| 5. ఐరోపాయుద్ధము —ఖర్చులు, విరాళములు | 17.9 / 18.9 | 1920-1931 | 137.96 |
| | | మొత్తముకోట్లు | 536. 0 |

ఈ రోజున ప్రజాఋణముల జాబితానుండి మనము ముదరా కోరునట్టి ఋణములను వేరుచేయుట యసాధ్యమైనను మనము కోరు ముదరామొత్తములను, ప్రజాఋణములను, దానిమీద నాయాకాలములందు చెల్లింపబడిన వడ్డీని తహావేలువేసి చూచుకొనినచో చెల్లింపబడిన వడ్డీమొత్తము సరిగా మనము ముదరా కోరిన అసలుమొత్తములమీదనే యని విశదము కాగలదు. ఈక్రింది పట్టీలో నీవిషయము తెల్లమగుచున్నది. మనము కోరిన నూటికి 4 చొప్పున వడ్డీ రేటు కూడ న్యాయమేయని యిది తెలుపగలదు. ఈ మొత్తములు కోట్లలో రూపాయిలు.

| సంవత్సరము | ముదరామొత్తం (కోట్లరూ) | ప్రజాఋణము (కోట్లరూ.) | సంవత్సరములో చెల్లింపబడినవడ్డీ కోట్ల రూ. |
|---|---|---|---|
| 1860 | 75 0 | 93.0 | 4.2 |
| 1874 | 112.0 | 117.0 | 5.3 |
| 1880 | 149.5 | 157 3 | 6.9 |

| | | | |
|---|---|---|---|
| 1890 | 149.5 | 207.1 | 9.3 |
| 1900 | 149.5 | 307.6 | 11 1 |
| 1910 | 149.5 | 405.6 | 14.25 |
| 1920 | 508.5 | 544.1 | 31.9 |
| 1931 | 508.5 | 1100.0 పైగా | 50.14 |

మొత్తము చెల్లింపబడినవడ్డీ.

| | |
|---|---|
| 1860-1874 | 81.0 |
| 1875-1900 | 226.5 |
| 1901-1920 | 326.8 |
| 1921-1931 | 415.4 |
| మొత్తము | 1049.7 కోట్ల రూ॥ |

కనుక మేము కోరుచుదరా భారత ఆదాయమునుండి బ్రిటిషు ఖజానాను రక్షించుకొనుటకుగాను అన్యాయముగా చెల్లింపబడిన 1050 కోట్లరూపాయిల వడ్డీలోను 536 కోట్లవడ్డీ మాత్రమే యని గ్రహింపదగును.

సమాప్తము.